# LAKSHANAPARINAYAM.

TIRUPATI VENKATESWARA KAVULU,

*SATAVADHANEES &c. &c. &c.*

DEDICATED TO

SRI TATIKONDA RAMAREDDI DESAYI.

SECOND EDITION.

1000 COPIES.

PRINTED AT

SRI BHYRAVA MACHINE PRESS,

MASULIPATAM.

*Price annas six.*

1907.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

# లక్షణాపరిణయము.

ఇది

శ్రీతిరుపతివేంకటేశ్వరులచే

రచియింపఁబడి,

శ్రీతాటికొండ రామారెడ్డి దేశాయిగారి

కంకితమీఁబడి,

శ్రీ భైరవ ముద్రాక్షరశాలలో

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

రెండవకూర్పు 1,000

మచిలీబందరు.

దీనివెల 6 అణాలు.



1907.

*

# పీఠిక.



ఆర్యులారా?

మేమీ లక్షణాపరిణయములో నచ్చటచ్చటఁ దెలుఁగులోఁగలిపి జనులు వాడుచున్న కొన్ని యితరభాషా ప్రయోగములను రసానుగుణముగా నంగీకరించి ప్రయోగించియున్నారము. దానికిఁ గవిత్రయేతరులగు మహాకవుల నేకులు మార్గదర్శకులై యుండిరని మీకుఁ దెల్పుట పునరుక్తియకదా? ఇఁక నిందు ముద్రాదోషములుగాని ప్రమాద వశమునఁ బడిన యస్మత్కవితాదోషములు గాని యున్నయెడల దయాళు లగు మహనీయు లెవ్వరేనిఁ దెలిపిన మఱియొకసారి ముద్రించునప్పుడు సవరణచేసికొనుచున్నారము. ఇదివఱ కనేకులు రచియించిన యీకథనే ప్రబంధమొనర్చుటకు ముఖ్యకారణము కృతినాయకుని యొక్క యభీష్టమేకాని వేఱొండుకాదు. శ్రీరామాయణము ననుసరించి యెంతమంది మహాకవులెన్నివిధములుగా వ్రాసిరో మీరెఱుఁగనిదికాదు కదా? సాధ్యమైనంతవఱకు ముద్రాదోషములు ఆయాయాశ్వాసములచివరున వివరించితిమి. వెనుకటికూర్పునందలి ప్రమాదముల నిందు సవరించితిమి.

ఇట్లు

విధేయులు,

దివాకర్ల తిరుపతిశాస్త్రి }<br>
చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి } శతావధానులు.

*

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

తిరుపతివేంకటీయము.

# లక్షణాపరిణయము.

## ప్రథమాశ్వాసము.



రామామణి జానకీరమణి యై సేవింపఁ దమ్ముల్ సదా
గారాబమ్మునఁగొల్వ నెల్లయెడలన్ గల్యాణముల్ మీఱను
శ్రీరంజిల్లునయోధ్య నేలికొనునా శ్రీరాముఁ డెల్లప్పుడున్
శ్రీరామాధిపు నాత్మనామధరు రక్షించున్ గృపాశాలియై.

సీ॥ సత్వరజస్తమశ్శక్తులలో సత్వశక్తియగా లక్ష్మియంశమునఁ బొడమి
యాత్మానుగుణగుణాఢ్యమ్మగువృత్తిఁ జెన్నారువిదేహుగేహమునఁబెరిగి
తమముప్రధానమై తనరెడుశివువిల్లు విఱిచిన శ్రీరామువరునిఁగఁగొని
రాజసంబణఁచి యరణ్యమేగెఁ భర్తకనుకూలయై వెంట నరిగిరావ;

తే॥గీ॥ తామసులనుగ్రాఁచి జగముల యార్తిఁద్రోచి
భర్తతోడఁ గుబేరపుష్పకము నెక్కి
మఱల సాకేతమేలంగ మఱలివచ్చు
సీత శ్రీరామవిభునకు సిరులొసంగు. ౨

శా॥ శ్రీకెంగేలనెసంగురాచిలుకఁ బేర్మిన్ జూచి ముద్దాడి “నా
బాకీ తీర్పు” మటంచుమాయై నిమిరి దువ్వన్ జిల్క “యక్కా? యదే
మోకృష్ణుండనెవింటె” యన్న వగుమామోమున్ విలోకించునా
శ్రీకాంతుం గృతార్థుఁ జేయుత యశోర్థిన్ రామభూమీపతిన్. ౩

ఉ॥ “కల్లలుపన్ని నన్విడిచి కానలలో నల చెంచుబోటితో
నల్లరి సేయుదే” యని యొయారముగా మగసేఁత సేయుచో
నల్లనఁ జెక్కుఁగొట్టి యకటా కడు నెచ్చితివంచు నవ్వుమా
పల్లవపాణి యోగ్యనకు భాగ్యములిచ్చుత రామశౌరికిన్. ౪

మ॥ నెనరుంజిల్కెడి ముద్దుపల్కులను శ్రీనీలాచలోష్ఠామృతా
దనసారస్యము గానుపింప నిజభక్తశ్రేణి గీర్తింపఁగా
ననురాగమ్మునఁ దాటికొండనగరిన్ హాళిన్నివాసమ్ముచే
సినయిల్వేలుపు వేంకటేశ్వరుఁడు వాసిన్ బ్రోచు రామాధిపున్. ౫

సీ॥ ఐదుమోములజంగమయ్యపూవుంబోడి యాఱుమోములవానియనుఁ
గుఁదల్లి, కలిమికోమలిపల్కువెలఁదుల్ గొలుచుదేవి కడిమితోఁట
నెసంగుకలికిమిన్న, పోతురక్కసునితోఁ బోరాడిన నెలంత జేజేలనరసి
బ్రోచెడి పడంతి, పూఁపజాబిల్లి పూవుందాల్చినవెలంది జగముల
న్నియుఁ బ్రోవఁజాలుజాణ;

తే॥గీ॥ మంచుగుబ్బలి రాచూలు మించువన్నె
వలువఁగట్టిన యెలనాగ చలువచూపు
కోపులన్ జూచి రక్షించు గోకిరెడ్డి
వంశమణియైన శ్రీరాము వల్గుధాము. ౬

శా॥ “నాకై ఘోరతపమ్మొనర్చి తుదకన్యాయమ్ముగా నాతప
శ్శ్రీకిన్ భంగముకూర్చ కోరితపుడిస్సీ! యింత మాత్రాన కే
లా? కోప”మ్మని దీనుఁడయ్యు సతియల్కన్ బాపి నవ్వించు గౌ
రీకాంతుండు కృపాళుఁడై మనుచుతన్ శ్రీరామభూమీశ్వరున్. ౭

మ॥ పతిచేమున్నుగ సామవేదము పఠింపన్ జేసి యామీఁదఁ ద
ద్గతి వీణన్ బలికించి నేర్పుమెయి శుద్ధశ్రోత్రియుండైన త
త్పతికిన్ గానరసంబు నేర్పఁ దనగీతప్రౌఢిమన్ జూపు భా
రతి వాక్పాటవమిచ్చి ప్రోచుఁ గృపమీఱన్ రామభూనాయకున్. ౮

సీ॥ ఒకమోముభారతీ వికచాంబుజాస్యవా తెఱఁజిలుకఁ దీయనితేనెఁగ్రోల
నొకమొగంబాపడంతుకతోడ సరససల్లాపమాధుర్యంబుచూపుచుండ
నొకమొగంబావెలందుకతావిఁజిల్లు పుక్కిటివీటితమ్మపుక్కిటవహింప
నొకమొగంబానెలంతుకతోడరతికలావిషయికోపన్యాసవిధులుదెల్ప;

తే॥గీ॥ నొక్కమధుగోష్ఠ పానముదక్కఁ దక్క
కృతులఁ బ్రతిసేయనేరని యింతిమిన్న
బిట్టు కౌఁగిలి గిలిగింత నెట్టుకొన్న
నలువ కృతిపతికాయువు కలిమిఁబెంచు. ౯

తే॥గీ॥ కృతిపతి యొనర్చునట్టి సత్కృతుల కంత
రంత రాయమ్ములొడఁ గూర్పకలరు కొఱకు
మొదటఁ జెల్లింపవలసిన మ్రొక్కు లొసఁగి
వేఁడికొందుము మాబొజ్జ వేల్పుదొరను. ౧౦

తే॥గీ॥ కాళిదాస మయూరాది కవులు నన్న
యాదులు కవులు చేసిన యట్టి కావ్య
ములఁ జదివి క్రైత సెప్పఁగ మొదలు వెట్టి
సలుపకుందుమొ? తన్నమస్కారమేను. ౧౧

తే॥గీ॥ అన్నవస్త్రమ్ము లొసఁగి విద్యలను శిష్యు
లకు ననుదినమ్ము చెప్పువిలక్షణప్ర
భావు భావుక భావు మాపాలిదేవు
బ్రహ్మ గురువర్యుఁ గొల్తు మపారభక్తి. ౧౨

తే॥గీ॥ ఏచతురు లోర్వలేమి పిసాచులెలమి
సత్కవులమీఁదఁ బడకుండ సలిపి రట్టి
సుకవులకు వందనమ్ములు కోట్లకొలఁది
స్థిరతర మగుభక్తి రచింప వలదె. ౧౩

ఆ॥వె॥ గ్రంథచోరులైన కవులార? మాపద్య
ములను దొంగిలింప వలదు వినుఁడు
మాదుక్రైత కొక్కమారు వేసము వైచి
మార్చికొందమన్న మారఁ బోదు. ౧౪

ఉ॥ ఆఁకలిఁ దీర్చి కొంటె వరికైనను ధర్మము కాన బైటివు
ల్లాకులనంకఁబోయి యటనాఁకలిఁ దీర్చికొనుండు లోనికిం
బోకుఁడు పోతిరేనిఁ గడుముప్పగు మీచిరజీవి భావమో
కాకవులార? మీకుఁ జిరకాలము పాయకయుండుఁ గావుతన్. ౧౫

ఆ॥వె॥ మచ్చరమ్ము విడిచి మాకవిత్వరసమ్ము, గ్రోలరయ్య మెచ్చుకోలుగలిగి
యోర్వలేమి నేడు పొందమీకన్నీర, పోపుఁగాని యేమిపోవు మాకు. ౧౬

క॥ "అవిశేష విశే" వనిమా, కవనము నిందింత్రుగాక కవులందతికిన్
జవిగల్గు కృతులనొసరిం, ప విరించిప్రమదకైనఁ బసువగుఁగాదే. ౧౭

చ॥ పలువురు సత్కవిత్వమది పాల్పడకుండినఁ గొన్ని పుస్తక
ములు రచియించి సిగ్గలకమోసము నొందుట తప్పగాదు పు
త్రులు తనకుద్భవించినఁ "కురూపులు కాఁగల" రంచు భార్యతోఁ
గలయికమాను నే? సుతులఁగాంచకయుండు నె? రూపహీనుఁడున్. ౧౮

సీ॥ ప్రియురాలిపాలిండ్లబిగువెఱింగినవాఁడు జిగికైతయందలిసొగసెఱుంగు
రుచిరాస్యకెమ్మోవిరుచులెఱింగినవాఁడు రసకవిత్వంపుసారస్యమెఱుఁగు
పద్మాక్షిచూపుసోవలనెఱింగినవాఁడు తీక్ష్ణకవిత్వంపుఁదేటయెఱుఁగు
పలువెలందుకలకౌఁగిళులెఱింగినవాఁడు మిశ్రకవిత్వప్రమితులెఱుంగు;
తే॥గీ॥ నంధతమసాభిసారికా గంధ మెఱుఁగు
వాఁడె యాశుకవిత్వంపు జాడయెఱుఁగుఁ
గాని యన్యుల కెఱుఁగ శక్యమ్ము గాదు
భావవిజ్ఞాన మది పయిపైనిఁ గలదె. ౧౯

క॥ లలితప్రబంధములలో, పలయమకముఁదూర్చి రసము పాడొనరింపన్
వలయునె? పెరుగునువడ్లును, గలపోసినముచ్చటగునె? కవివరులారా. ౨౦

చ॥ మతిగలవారికేనియుఁ బ్రమాద మెలర్పక పోదు పుష్పస
మ్మితకవితాలతాంగిని రమింపుఁడు కేవలశాస్త్రులార? మీ
మతులకు నచ్చినట్లు రసమాధురిఁ గ్రోలుఁడుగాని వ్యర్థపుం
జతురిమఁజూపి దాని స్తనశల్యపరీక్ష యొనర్పఁబోకుఁడీ. ౨౧

వ॥ అనిశిష్టాచార ప్రశంసలొనర్చి.

మ॥ ప్రతిసంవత్సర మాఘమాసమున గద్వాల ప్రభుం డిచ్చు ను
న్నత సత్కారపు వార్షికమ్ముఁ గొని కొన్నాళ్లిచ్చటన్ రాజబం
ధుతతుల్ సత్కవిశాదగుల్ మిగుల సంతోషమ్ములన్ దేల్పను
న్నతటిన్ దన్నృపుస్వాలకుండు కడుసన్మానుం గండు స్నేహార్ద్రుఁడై. ౧౨

వ॥ భక్తితాత్పర్యమ్ము లిగురింప నస్మత్కృత సంస్కృతగ్రంథమ్ముల యందలి శ్లోకమ్ములును నాంధ్ర ప్రబంధమ్ముల యందలి పద్యమ్ములను దదేకాయత్త చిత్తమ్మున సానుజుండును సపుత్రమిత్రుండును నై వినుచుఁ జుట్టు వారియున్న పండితకవిసంఘము దిక్కు మొగంబై. ౧౩.

సీ॥ గద్వాలరామభూకాంతుని యిల్లాలు గారాపుఁ జెలియ లేఘునయశునకు
సౌమిత్రికన్న నచ్చపుభక్తి యుక్తిఁ జెన్నారు రాజారెడ్డి యనుజుఁడెవని
కట్టెఁడిట్టెఁడటంచు ననరాని మేటితిమ్మారెడ్డి యెవనికి మఱొకతమ్ముఁ
డత్యంతసత్కవిత్వాదగుండైన లక్ష్మారెడ్డి యెవ్వానిమాతులుండు;
తే॥గీ॥ చిన్నతనమంద కృతులకుఁ జేతులొగ్గు
నిపుణబుద్ధి సీతారామనృపతి సార్వ
భౌముఁ డెవ్వానికి ననుంగు భాగినేయుఁ
డతఁడు శ్రీరామనృపతి పండితహితుండు. ౧౪

క॥ శ్రీతాటికొండ పురమున
నేతాదృశగరిమ నేలు నీతిపరుఁడు వి
ఖ్యాతుం డతిశాంతుఁడు వి
ద్యాతిశయం బెఱుఁగు జాణ యనుపమరక్తిన్. ౧౫

చ॥ తిరుపతి వేంకటేశ కవిధీరులమమ్ముఁ గాంచి వాక్యచా
తురి మెఱయంగ నిట్లనె బుధుల్ బళిరే యన మీరు గ్రంథముల్
విరచనచేసి యుంటిరి ప్రవీణతమై మఱియెన్ని యేని, యం
దరయఁగ నాకు భాగవతమన్నఁ టికిం దలమానికంబగున్. ౧౬

శా॥ స్వామీ మీకవితాప్రవాహము జగచ్ఛ్లాఘ్యంబు మాబోఁట్లుత
త్సామర్థ్యం బిదమిద్ధమంచు వచియింపన్నేర్తురే లక్ష్మణా
భామన్ గృష్ణుఁడు పెండ్లియాడుకత నాపైఁ బేర్మి మీ రాఱంగృతిం
గామిమ్ముం దయఁ జెప్పవేఁడెదను సత్కారమ్ము తోరమ్ముగన్. ౧౭

చ॥ తిరుపతివేంకటేశ్వర సుధీమణులార కవీంద్రులార దు
స్తరతరబుద్ధి భాక్ఛతవధానవిధానపటిష్ఠులార భూ
వరహితులార మెక్కుడు కృపామతి నాకుఁగ మాకు లక్షణా
పరిణయమున్ రచింపవలెఁ బండితమండలి కింపుగావలెన్. ౨౭

మ॥ కవితాకన్యక లెండతేనిఁ గలరిక్కాలమ్ము నందల్ల వా
రువిచారింపఁగ గ్రుడ్డికన్నుగలవారో కుంటివారో సురూ
పవిహీనాత్ములో కాఁగలారు వివరింపన్ సర్వసంపన్న మీ
కవితాకన్యయటంచు మెక్కి పలుకంగా నేర్తు ముమ్మాటికిన్. ౨౮

తే॥గీ॥ చెన్నపురి రాజధానిలోనున్న రాజ
నగులు నైజాములోనున్న నరవరులును
మీశతవధాన కృతులకు మెచ్చికాదె
బంగరు బిరుదులొసఁగిరి బహుమతులుఁగ. 30

ఉ॥ ఏనుఁగునెక్కినారు ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినారు స
న్మానములందినారు బహుమానములం గ్రహియించినార లె
వ్వానిని లెక్కపెట్టకనివారణ దిగ్విజయంబొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుఁగొనినారలు మీరుకవిత్వసంపదన్. 3౧

శా॥ ఈయాంధ్రావనియందు మీకనవిభూమీశుల్ మిముం బూజలన్
జేయన్నేరని రాజచంద్రులును నాచే నశ్రుతుల్ వేయునే
లా? యీనాఁటికవీంద్రులం దెవరు విద్యాశక్తి రాజన్యరా
జ్యాయత్తంబగు పట్టపేన్గుపయి నాహా పుట్ట నూరేగిరే. 3౨

తే॥గీ॥ హెచ్చుతగ్గులు తులఁదూఁప నెవరికన్న
హెచ్చుమాబావగారు వారిచ్చినారు
మీకు బంగరుబిరుదు లమ్మేటిమేటి
వారికమిచ్చు మీకు నెవ్వరికి హెచ్చు. 33

తే॥గీ॥ శ్రీకరుండగు నరసదీక్షితుని సుతుఁడు
సుకవియగు పాపశాస్త్రికి సోదరుండు
అప్పదాస్థానమునకు ధర్మాధికారి
బారయకు మీరనినఁ గడు గౌరవంబు 3౪

క॥ మాతండ్రిగారు మనుకృతి
కై తామెంతేని యత్నమలరించిరిగా
నీ తగుకవిదొరకమిఁ ద
చ్చేతం బొప్పకొనఁదయ్యెఁ జెప్పించుటకున్. ౩౫

క॥ జనకుని కోర్కెం దీర్పని
తనయునిఁ దనయుఁడని చెప్పఁ దగ దండ్రటుగా
వున నీకృతి కారణముగ
ననుఁగృతకృత్యునిఁగ జేయన్యాయ్యంబనుచున్ ౩౬

వ॥ వాగ్బహుమాన పూర్వకమ్ముగఁ దాంబూలంబువెట్టుటయు నేమును సతనియోగ్యతకునలరి యీవిభువతంసుండు తక్కుఁగుణములట్లుండఁ బిత్రనుజ్ఞాకరణ ధురంధరత్వమ్మునను నిజమ్ముగ రాముఁడేయగునని ప్రశంసించుకొనుచు నాతనివంశ క్రమంబుఁ గొండొక వివరింపఁ బూనితిమి.

క॥ సిరియే చరణము వరమా
దరమున సేవించు నట నుదయమందెను శం
కరు తలపూతోఁబుట్టువు
ధరనుత్తమ శూద్రకులము తగియెడివృద్ధిన్. ౩౭

తే॥గీ॥ కారణాంతరముల దానఁ గలిగె నెన్ని
యేనిభేదమ్ములవి చెప్పనేల? నాఁడు
నేఁడునిఁకమీఁద వికృతులజాడఁ దాఁటఁ
ననిదియె యొప్పు నొక పాకనాఁటికులము. ౩౯

ఆ॥వె॥ క్షమకు సత్యమునకు సత్త్వమ్మునకు రాము
నాఁటివారు పాకనాఁటివారు
భోగభాగ్యములకు యోగమ్మునకుఁ గృష్ణు
నాఁటివారు పాకనాఁటివారు. ౪౦

తే॥గీ॥ వారి గోత్రములెన్నియో నటులనందు
గోకిరెడ్డియనెడి కాఁపుగుల పురుషుఁడు
గాఁగలిగి యతిరాజసకలన మిగిలి
యొక్క తెగవారు బల్ సిరినొప్పుచుండ్రు ౪౧

చ॥ భరతునిఁబట్టి యిందుజులుభారతులైరి రఘుండు హేతువై
పరఁగిరిరాఘవాఖ్య నలభానుకుల ప్రభవుల్ మహాయశ
స్కరుఁడగు గోకిరెడ్డి యతిశస్త గుణాకరుఁ డిందుఁగల్గుటన్
వఱలెను వానిపేర్గలిగి వంశము పీరిక సంశయమ్ముగన్. ౪౨

క॥ అతిరాజస గోత్రావ
స్థితిచే నతిరాజసత్వసిద్ధి గలిగెనో
యతిరాజులగు పీరలె
గతియగుదురో గోత్ర మట్టిగతిఁ గాంచుటకున్. ౪౩

తే॥గీ॥ తెలియు టతి దుర్లభంబని
ధీరులెన్నఁదగిన యవ్వంశమందు ముత్యమ్మువోలె
రంగధాత్రీవతంసుఁ డారంగనుదయ
మందిర ప్రజనేలె నిరత నిష్పందయశుఁడు. ౪౪

శా॥ పొంగారంగల కీర్తి కెల్లయగుచున్ భూలోకదేవేంద్రుఁడై
సింగంబన్నను జీరికింగొనక విస్తీర్ణప్రతాపాప్తి నే
లంగల్గెన్ మఱినేలనర్థిజనులెల్లన్ దన్నుశ్లాఘింప, నా
రంగారెడ్డి గుణోత్తరత్వమది వర్ణ్యంబౌట కాశ్చర్యమే. ౪౫

తే॥గీ॥ ఆతనికుమారుఁ డత్యంతశీతలుం డ
నంతధరణీశుఁ డీతఁడనంతయశుఁ డ
నంతసుగుణాకరుండు ననంతతేజుఁ
డగుచుఁ బాలించిమించె ననంత నెలమి. ౪౬

తే॥గీ॥ ఆతనికిఁ బుత్రుఁడయ్యెఁ దిమ్మావనీంద్రుఁ
డతఁడు పూర్వులఁబోలి రాజ్యమ్ము రామ
రాజ్యముగ నేలి పుత్రికఁ బ్రాజ్యసుగుణఁ
గాంచెఁ గొండమ్మ యను నొక కాంచనాంగి. ౪౭

క॥ శ్రీరమణు సాటిదగు రా
జా రెడ్డికి నామెనిచ్చి సర్వోన్నతమా
తీరునఁ బెండ్లి యొనర్చి ధ
రారమణునిఁ జేసెఁ బిదప రాజ్యమ్మిడియున్. ౪౮

తే॥గీ॥ జలధి నిల్లటముండిన శౌరిపోల్కి
హిమగిరి వసించు నలనగజేశు మాడ్కిఁ
దాటికొండ పురమ్మునఁ దావసించి
మించి పరిపాలనమొనర్చె నంచితముగ. ౪౯

క॥ ఆరామయందుఁ గనె సు
శ్రీరుచిఁదగు రామచంద్రరెడ్డిని మఱి ల
క్ష్మారెడ్డిని గొమరులుగా
నారాజా రెడ్డి వంశ మతి వృద్ధిఁదగన్. ౫౦

క॥ మాతామహ కులగోత్ర
ఖ్యాతులు వీరైరి భ్రాతగల కన్యకనే
నాతిగఁ గొనఁదగుఁ గాదే
నీతిరగువారి నేమమిట్టిది యగుటన్. ౫౧

సీ॥ ఇరువురు ప్రఖ్యాతికెల్లలై తగువార లిరువురా కృతిపొంకమొసఁగువార
లిరువురర్థులకిచ్చు నిచ్చఁ బొల్చెడివార లిరువురు విద్దెల వారగుటనెఁ
లిరువురు కవులచే నెన్నికగనువార లిరువురు కనికరం బెనయువార
లిరువురధర్మము నీసడించెడివార లిరువురు శతృలి నొరయువార;
తే॥గీ॥ లిరువురును దాతతండ్రుల సరణివార
లిరువురన్యోన్యమును మైత్రిఁ బరఁగువార
లొక్క యుగభేద మొక్కటిదక్క రామ
లక్ష్మణులు రామలక్ష్మణుల్ లలితమతులు. ౫౨

తే॥గీ॥ వీరలాచారపరులు సుశ్రీరుచిరులు
వీరు లతిధీరు లత్యంత శూరు లధిక
బంధుపోషణ తత్పరుల్ ప్రబలు లెంత
కేనిఁదగు చేనఁగల వారలిద్ధయశులు. ౫౩

ఆ॥వె॥ రామచంద్రరెడ్డి రమణీమణుల కెల్ల
మేలుబంతి యనెడి మేల్మిగన్న
లక్ష్మమాంబికను సలక్షణమ్ముగఁ బెండ్లి
చేసికొనియె మిగుల వాసియెసఁగ. ౫౪

సీ॥ మునికులగోత్ర సముద్భవుండగు ననంతారెడ్డి యేగుణోత్తరకుఁదండ్రి
తనపేరు సార్థకత్వము వహింపఁ జరించు రత్నమాసాధ్వి యేరమణితల్లి
తిరుగుళ్లపురమేలు నరపతి నారసింహారెడ్డి యేసతికన్నగారు
రాజమాన్యుఁడు మేటితేజోయుతుండు లక్ష్మారెడ్డి యేజగన్మాన్యతమ్ముఁ;
తే॥గీ॥ డట్టి శ్రీబుచ్చమాంబ గోపాంబపేర
లిరువురును భార్యలై తనకెసక మెసఁగ
భోగదేవేంద్రుఁడై వృద్ధిఁబొందెనార
శ్రీయుతుండు లక్ష్మారెడ్డి ధీయుతుండు. ౫౫
సీ॥ లక్ష్మి సరస్వతుల్ రహిసీడనఁగవచ్చు నన్యోన్యమును మైత్రియమరెనేని
సాహితీగీతులు సరినాఁగఁదగు నేకపురుషాశ్రయత్వంబు వఱలెనేని
శాంతిదాంతులతోడసాటిసేయఁగవచ్చుఁబై నొంకులో నొగకుఁబరఁగనేని
శ్రద్ధామనీషలు సరిచెప్పఁగావచ్చు నన్యోన్యవైరుధ్య మలరదేని:
తే॥గీ॥ అక్కచెల్లెండ్రునై సమానాకృతులయి
సవతులయ్యును భేదమ్ము లవములేక
క్షీరనీరవిధమ్మునఁ జెలిమిగలిగి
డంబలరు బుచ్చమకును గోపాంబికకును. ౫౬
క॥ ఆలక్ష్మారెడ్డియు మఱి
యాలలనలలోన బుచ్చమాంబయును లస
చ్ఛీలుర మువ్వురుగొమరుల
బాలిక నొక్కర్తుఁగని రపారయశస్కల్. ౫౭
క॥ శ్రీలక్ష్మిదేవియను స
ద్బాలిక తనపేరు సార్థపటిమ వహింపన్
బాలశశిరేఖయో యనఁ
గా లలివృద్ధిం దనర్చెఁ గళలలరారన్. ౫౮
ఉ॥ ఆలలనాలలామ సుగుణాకరుఁడౌ గదవాలరామభూ
పాలునకిచ్చి పెండిలి యపార ముదమ్మునఁ జేసి రాపెస
చ్ఛీలము తన్మనోహరు ప్రసిద్ధియు సీగియు నిర్ణయింపఁగాఁ
జాలుట మాకకాదు జలజాతభవాదులకేన శక్యమా ౫౯

తే॥గీ॥ ఈమెకన్నను జిన్నలై యెల్ల సుగుణ
ములను నెవ్వరికన్నను మొదటి వార
లగుచు నలరారుచుంద్రు రాజానసింద్రుఁ
డును మఱియుఁ దిమ్మనృపతియు ననుపమితులు. ౬౦

క॥ ఇరువురు విద్యలలో ఘను
లిరువురు నాకారవంతు లిరువురునన్నన్
గురుభక్తిఁ గొల్చు గురుయశు
లిరువురు సంతానవంతు లిరువురు శాంతుల్. ౬౧

మ॥ మతిమంతుండయి ఫారసీచదివి తిమ్మారెడ్డి ప్యాసయ్యె ను
న్నతమైనట్టి వకీల్పరీక్ష యుదియుండన్ దెల్గునన్ సత్కవి
ప్రతతుల్ మెచ్చఁగ నీతివాక్య పదపూర్వంబైన రత్నావళిన్
గృతిగానై యొనరించె నమ్మహితునిన్ గీర్తింపఁగాఁ జెల్లదే. ౬౨

క॥ వీరికి నెల్లన్ జ్యేష్ఠుం
డై రాజిలు ననుపమానమగు శాంతికి తా
వై రామారెడ్డి మహా
ధీరుఁడు గంభీరుఁడును సుధీమాన్యుఁడునై. ౬౩

తే॥గీ॥ ఫారసీభాష నెక్కుడు పండితుం డ
రేబియన్ భాషలోన నుత్కృష్టతముఁడు
తెల్గునం దెంత కేనియుఁ దెల్విగల్గు
వాఁడు వినయాది గుణముల వీడతండు ౬౪

ఆ॥వె॥ ధర్మసుతున కేనిఁ దప్పు వెదకవచ్చుఁ
గాని యితనియెడలఁ గానరాదు
ఇంత శాంతి దాంతి యింత యనుద్ధతి
యింత యోగ్యతయు మఱెందు లేదు. ౬౫

తే॥గీ॥ కవులతో స్నేహమొనరించు ఘనుఁడతండు
కవులతో స్నేహ మొనరించు ఘనుఁడితండు
భేదమిట్టిది యొక్కింత లేదయేని
రామవిభుఁ డనవచ్చు నీ రామవిభుని. ౬౬

క॥ ఆరాముఁ డనంతాసుత
గారాముస బెండ్లియాడెఁగా రాముఁడితం
డారామతల్లి పేరిఁటి
నారీమణిఁ బెండ్లియాడె నయ వినయ యుతన్. ౬౭

క॥ ఎంతేనిఁ దనకు పెద్దలు
సంతసమునఁ బొదల రామజనపతి యాయు
ష్మంతుని సుశ్రీమంతు న
నంతాంబికయందుఁ గనె ననంతారెడ్డిన్. ౬౮

## షష్ఠ్యంతములు .

సీ॥ ఏతాదృశ గుణాళిచేతఁ బొల్పెడివాని కతులిత వైభవంబులకు వాని
కీవిచేఁ బ్రఖ్యాతి నెనసి వర్తిలువాని కతిశుద్ధమగు చిత్తమమరు వాని
కధికమౌ రసికత కాధారమగు వాని కఖిల విద్యాశాలి యైనవాని
కెనలేని వినయంపు గనియైన వానికి ధైర్యమెక్కుడు గల్గి తనరు వాని;
తే॥గీ॥ కభ్యుదయములు గల్గెడు నట్లు మేము
బుధులు ముదమందు గతిఁ జేయఁ బూను లక్ష
ణాపరిణయమనెడి ప్రబంధమ్మునకుఁ గ
థాక్రమం బివ్విధమ్మున దనరుచుండు. ౬౯

## కథాప్రారంభము.


సిరికింబట్టు యశోవిభూతి విజయశ్రీశోభితాశాంతకుం
డరిరాట్కానన వీతిహోత్రుఁడు ప్రశస్తౌదార్యభాభాసురుం
డరుణాన్యాకరణ క్రియాచణ ప్రతాపాలంబి సౌజన్య సు
స్థిరుఁడస్తోకకలావిలాసుఁడు బృహత్సేనప్రభుం డొప్పగున్. ౧

ఉ॥ దాత మహానుభావుఁడు బుధప్రతతిం గరుణించు వాఁడు ని
ర్ణేత సమస్త విద్యల, కనింద్యచరిత్రుఁ డపాస్తశత్రుఁడు
ద్ధూత సమస్త కల్మషుఁడు దూరవిచారణ శీలుఁ డుత్తమ
ఖ్యాతిసమేతుఁ డానృపతికాంతునిఁ బోలఁగఁ జాలరొండొరుల్. ౨

సీ॥ ప్రతిలేనిసంపత్తిఁ బరిఢవిల్లుటె కాదు విద్యావిశేషముల్ వెలయు
వాఁడు, అనుపమాన ఖ్యాతి నతిశయిల్లుటె కాదు వినయాతిశయము
శోభిల్లువాఁడు, అధికప్రతాపమ్మునంది యుండుటె కాదు శాంతి దాం
తులను మెచ్చఁదగువాఁడు, అప్రతిమాకృతి ననుగమించుటె కాదు
తల్లిఁగాఁ బరభార్యఁ దలఁచువాఁడు;

తే॥గీ॥ సకలసుకవిచకోరకనికరపూర్ణ
మాతుషారకరాయితామందవితర
ణక్రియాశాలి రాజన్య చక్రమౌళి
మానితపదద్వయుఁడు బృహత్సేనవిభుఁడు. 3

సీ॥ సుకవివచ్చెనఁటన్నఁ జూడనంపుటె కాని మనకేమియని యూరకొనుట
లేదు, విద్వాంసుఁడనియన్నఁ బిల్వనంపుటె కాని పోనిమ్మనుట మొట్ట
మొదలె లేదు, గాయకుండనియన్న గారవించుటె కాని నాస్తిపొమ్మ
నుట స్వప్నమునలేదు, యాచకుండనియన్న నాదరించుటె కాని యా
నడించుట యెన్నఁడేని లేదు;

తే॥గీ॥ ఎన్నిసార్లైన నడిగిన నిచ్చుచుండు
కాని సున్నిడు టొక్కమార్లైన లేదు
అనృతమాడుట మందునకైన లేదు
పన్నుపులు సాటి యాబృహత్సేనపతికి. ౫

క॥ నయమా ప్రతిపదసంపదు
గయమా యామిూఁద మత్తతత్తద్రిపురా
జ్జయమా యదియునుగాక వి
నయమా వేఱొకరుఁ డెట్లుగా దావృశుఁడే. ౬

క॥ ఆరాజేంద్రునికొక్క కు
మారీమణి తనరు సకల మనుజేంద్ర తనూ
జారత్నములకు నాఁపెకు
వారరయఁగ హాస్యము శక వైఖరి నొప్పన్. ౭

తే॥గీ॥ ఆసరోజాక్షి పుట్టినయది మొదలుగ
సకలశుభలక్షణములనలరుకతన
లక్షణయటంచుఁబల్కె రెల్లరును సత్య
సోదరీలక్షణము లెంతయొప్పనుగ్గొ. ౮

తే॥గీ॥ ఆమగువజన్మ సుక్షేత్రమే మొకాని
పుట్టినదిగోలె శ్రీకృష్ణు పుణ్యకథలు
వినఁగ మది ముచ్చటంబను వెన్నుఁడన్న
మాట విన్నంతమాత్ర సమ్మదము చూపు. ౯

ఉ॥ ఆయెలనాగ శైశవమునందున మేల్రతనంపుఁ దొట్టిలోఁ
బాయనికూర్మి నుంచి తగుపాటలు పాడెడివేళ లాలికృ
ష్ణా యనునాలకించి పదనాంబుజ మంకురితస్మితమ్ముగాఁ
గోయనిమించి యాడునఁట కోమలిజన్మవిశేషమెట్టిదో. ౧౦

తే॥గీ॥ పలుపలుకు వేల గరుడపక్షులు సయితము
సహజమగు కారణమునఁ గృష్ణాయటన్న
నాలకించి వినోదాబ్ధినోలలాడు
మతులెవరికైనఁ గత్తాను గతులుగావె. ౧౦

క॥ కేవల లక్షణయయ్యును
నా వెలఁదుక సర్వలక్షణాలంకార
శ్రీ వెలయ సలక్షణయనఁ
గా వృద్ధింజెందె శీతకరరేఖ యనన్. ౧౧

క॥ అలరులకు సౌరభమువలె
నెలకు శరత్సమయమువలె నీరదతతికిం
దొలకరి మెఱుపుంబలె న
న్నెలఁతకు జవ్వనంపునిగ్గుం గదోఁచెన్ ౧౨

సీ॥ ముసిముసినగవుల పసపసం బుగఁదూఁగె మొలకచూపుల సౌరుతళుకు
కుఁజిలికె, నడలందుఁ గవివింత జిగి నూల్కొనసాఁగె నెదవిస్తరించి
పయ్యెదనుదాఁగె, నడుము నానాఁటికి నాఁడారుగాఁదోఁచెఁ దొడల
యందమునఁ బుష్టిదొలకరించె, మాటతీఱువేఱొక్క వైఖరిఁ గనవయ్యెఁ
జాతురి పలుకుల నూఁతఁ గొనియె;

తే॥గీ॥ నంతకంతకు లావణ్యమతిశయించె
నింతనింత పనులయందు వేడ్కదొడరె
నంతిపురి ముగ్ధ నుంకుటభ్యాసమయ్యెఁ
గంతునకుఁ గాఁపురంబయ్యె నింతిమేను. ౧౩

తే॥గీ॥ జాఱుముడివైవఁగట్టి పైఁ బచారుసేయు
జడఘటించిన మడమలఁ దొడరియాడుఁ
గొప్పవెట్టినఁ దిలకన్న గొప్పగాంచుఁ
జొల్లెమిడుటొప్పదే యట్టిసుదతికురుల. ౧౪

మ॥ పరివేషమ్ములుగట్టె పూర్ణశశికలప్రాయమ్ములై యంత బం
గరుగోలీలనతిక్రమించి లికుచాకారమ్ములై పిమ్మటన్
సరసీజమ్ములమీఱి గట్టివడి విన్నాణంపుఁ బల్కుప్పలై
పరిమాణింపనశక్యమై యొసఁగె నప్పద్మాక్షివక్షోజముల్. ౧౫

క॥ రదములను మల్లెమొగ్గలు
పొదలన్ బేఁజన్నులనెడి పూవుంగుత్తుల్
గదియనునుఁ బల్కు కోయిల
రొదలొదవఁగఁ బుష్పసమయరూఢిన్ దనరెన్. ౧౬

క॥ అంతవసంతము సంతత
దంతురిత లతాంతమొప్పె దాంతవిరహిహృ
త్కృంతమతి కాంత సకలా
శాంతము సంతోషకరనిశాంతంబగుచున్. ౧౭

క॥ లేమావిగున్న చిగురుల
నామెయిమెసవంగఁ గోకిలాంగనలకు ని
త్యామోదప్రద మధుర
శ్రీమెఱయఁగఁ గంఠమునకు జీరలు తెగియెన్. ౧౮

క॥ అలకాలమెల్ల రకుసమ
కలన్ శాస్త్రప్రసిద్ధి గాంచినయయ్యెన్
గలయికలులేక తగు కాం
తులకున్ గాంతలకు నిశలు దుర్దశలయ్యెన్. ౧౯

ఉ॥ మామిడిపండ్లు పానకము మంజులతన్ దగు నిక్షుఖండముల్
భూమిసురాగ్రగణ్యులకుఁ బూర్ణముగానిడి చందనమ్ముమె
నోమియువీవనల్ విసరియున్ దనియింతురు పుణ్యవంతుల
య్యామనియందు మాధవున కాదర మెంతయు మేదురమ్ముగన్. ౨౦

క॥ అట్టియెడ బృహత్సేనుఁడు
దట్టములగు చూతములను దనరారిమణీ
కుట్టిత కుట్టిమమైబల్
వెట్టన్నెట్టఁ దగునట్టివిరి లేఁదోఁటన్.

చ॥ చరమధరాధరమ్మునకు సన్నిధిలో నొకయింత దవ్వునన్
సరసిజమిత్రుఁడుండ భటసంఘము గొల్వఁగనేగి నట్టివే
ళ్లరుచినెసంగి సర్వశుభలక్షితమై యలరారునట్టి చ
ప్పరమునఁ గూరుచుండెఁదగు పండితమండలి చుట్టువాఱఁగన్. ౨౧

ఉ॥ గాయకగానముల్ సెలఁగఁగా రమణీయ ధనాంగనామణీ
గేయవిలాసనాట్యములోగిన్ మిగులన్ దగ స్వస్తివాచకా
శ్రీయులు వేదఘోషమొనరింప నిలింపులకింపునింపు న
ట్లాయతమైనసంపదల నానృపుఁడంత వదాన్యమౌళియై. ౨౩

మ॥ మణులన్ వజ్రములన్ మహాంబరములన్ మధ్వాధులన్ మేటిద
క్షిణలన్ భూసురవర్గముం దనుపుచున్ గేల్మోడ్చి యవ్వారికిన్
బ్రణతుల్ సల్పుచు వీవనల్ విసరుచున్ బాటీరపంకంబు వీ
క్షణరమ్యంబుగఁ బూయుచున్ స్రజములన్ గంధమ్ములన్ వైచుచున్. ౨౪

ఉ॥ ఉన్నయెడన్ సమస్తజగదుత్సవకారణమై సమంతతో
భ్యున్నతపన్నగప్రకరపోషకమై ద్రమిడాంగనాకుచ
స్విన్నపటీర సౌరభవిశేషవరీమళమై యెలర్చి సం
పన్నవిపన్నభూరిసుఖబంధురమై మలయానిలంబొగిన్. ౨౫

క॥ ఆమలయానిలమొలయుట
చే మహీసురులును నృపాలశేఖరుఁడును భృ
త్యామాత్యాదిజనమ్ములు
నామోదరసాబ్ధిఁ దేలు నాసమయమునన్. ౨౬

సీ॥ కాషాయవస్త్రము కటితటమ్మునఁ గ్రాలఁ గాయమంతయు భూతిగడలు
కొనఁగఁ, ద్రిదశాపగామృత్తు నుదుటిపైఁ జెలువార మస్తకమ్మునజటా
మకుట మొలయ, దండకమండలుద్వయము కేలనెసంగఁ బాదమ్ము
లందుఁ బావాలుదనర, పేరురమ్మునఁ బద్మబీజమాలయొలర్ప వీణియ
బుజముపై రాణింప;

తే॥గీ॥ నంబరమునుండి కృష్ణకృష్ణాయటంచు
సరససంగీత భంగీత సంగతులను
బాడియాడుచు నానందభరితుఁడగుచు
వచ్చెనారదుఁడా నృపవరునికడకు. ౨౭

ఉ॥ వచ్చినమౌనిఁ గాంచి సభవారల వారణగౌరవంబుపై
పెచ్చుగ లేచిరంతఁ బృథివీపతికల్పిత పూజ కెంతయున్
మెచ్చి మునీంద్రుఁ డాదరము మీకొనఁ దన్నృపమౌళిదత్తమా
పచ్చలగద్దెపై హరినిఁ బాడుచు వేడుక పిచ్చలింపఁగన్. ౨౮

వ॥ సుఖాసీనుండై.

ఉ॥ నందకుమార భక్తజనతారక తారక ద్వారకాపురీ
నందనచందనద్రుమ సనాతన నూతనగోపసుందరీ
బృందమిళింద బంధురపరీమళధామమరంద నీకిదే
వందనముల్ పదింబదిగ వందలు వేలు పురందరార్చితా. ౨౯

ఉ॥ ఇందుముఖీమనోజ జగదీశ రమేశ విధీశనుత్య ని
ష్పందయశోవిశాల పరిపాలితసన్మునిజాల సన్మనో
నందన భక్తచందన కనత్కనకాంబర కృష్ణ నీకిదే
వందనముల్ పదింబదిగ వారిజలోచన పాపమోచనా. 30

క॥ చిక్కవు తపముల జపములఁ
జిక్కవు జన్నముల నేమి చేసినొ? నీకా
టక్కరి గొల్లవెలందులు
చక్కఁగఁ జిక్కితివి వారిసందిళులందున్. 3౧

మ॥ అలినీలాలక భీష్మకన్యతొడపై నానందముం దెల్పలీ
లలు చెన్నారఁగ సత్యభామ మధురాలాపమ్ములం దేల్ప ని
చ్చలు పైపెచ్చుగ నాసుదంతవిడెముల్ జానొప్పనందీయ మె
చ్చులకున్ మెచ్చులొసంగు నీవిఖ్యాతికిన్ జోహారు జోడించెదన్. 3౨

శా॥ కోకల్ చంకను బెట్టి గూఢగతిఁ దళ్కుం గొల్లముల్లాండ్ర బల్
వీఁకన్ వంచనచేసి పొన్నపయికిన్ వేంచేసి కూర్చుండి త
ద్రాకాపూర్ణనిశాకరాననల మర్మంబుల్ విలోకించు "నీ
జోకల్ లోకము మెచ్చుపోక" లనుచున్ జోడించి కేల్మోడ్చెదన్. 33

శా॥ రాకాచంద్రకనన్మయూఖతతిమీఱన్ జేరి కాళిందిలో
నేకాంతమ్ముగ గొల్లచేడియలతో నిచ్చల్ విహరింపఁ గో
క్రోకాచారము దప్పకుండ ననుఁగుంగోపాలకుల్ సూడ స్వే
చ్ఛాకాంతంబయియొప్పు నీదయిన రాసక్రీడ కేల్మొక్కెదన్. ౩౪

క॥ అనిమాటిమాటికిని న
వ్వనజాక్షునిచర్యలెల్ల వర్ణించుచు భ
క్తినిమీలితలోచనుఁడై
ముని వీణియమీటె రసము మోటలుగట్టన్. ౩౫

క॥ నెట్టికొనినారదుఁడు రస
ముట్టిపడన్ జలజనయను నొగిఁబొగడఁగ న
ప్పట్టునను బృహత్సేనుని
పట్టి వినియె వలపుకొంత పయిపయిఁబొంగన్. ౩౬

వ॥ పిమ్మట నారదుండును బృహత్సేనుండును గొంతవడినుచిత ప్రసంగ
మ్ములఁ గాలమ్ముఁ బుచ్చుచుండి రట్టియెడ నమ్ముని కెలననున్న లక్షణం
గాంచి నృపున కిట్లనియె.

ఉ॥ ఈయెలనాగ పెండిలికినీడయి తోఁచెడిఁ బెద్దలెల్ల నా
హాయనఁబోల్చు నాత్మమదనాంచితు నొక్కకుమారకున్ జగ
ద్గేయునిఁజూచి సర్వజనగేయముగా నికనైనఁబెండిలిన్
జేయక మిన్నకుంట తగునే? నరపాలకులావతంసమా! ౩౭

క॥ అన జనవరుఁడిట్లను నో
యనఘా! తగునట్టి నరవరాగ్రణిసుతునిన్
జననుతుని మీరలారసి
వినిచిన నవ్వానికిచ్చి పెండ్లియొనర్తున్. ౩౮

చ॥ అనవుడు మౌనియిట్లను ధరాధిప! మానులమైనమాకున
చ్చినపురుషుండు ప్రాకృతులుసెప్పెడివారలఁబోలె మీకు న
చ్చునొ యటుగాదొ నామదికిఁజొప్పడువాని వచింతు నాతఁడి
క్కనకనిభాంగికిం దగినకాంతుఁడటంచుఁ దలంతు నెంతయున్. ౪౦

ఉ॥ ద్వారక నేలువాఁడు సముదారగుణాఢ్యుఁడు మేలువాఁడు నా
కారము చెప్పనేల రతికాంతునిఁగన్న మనోహరుండు దు
ర్వారరిపుప్రకాండమదభంజనుఁ డాతనికన్న మేటి యీ
ధారుణిఁగాను నాకముఖధామములందుఁ గనన్ వినన్ జుమీ. ౪౧

ఉ॥ ఆతనికాతఁడే ప్రతి సమస్తవిధమ్ములఁ ద్వత్కుమారికా
రీతియుఁ జూడ నాతనివరింపఁగ నెంచెడియట్లుఁ దోఁచుమే
లీతరుణీశిరోమణికి నీడతఁ డావరిభూతశంబరా
రాతికిజోడు నీతనయ రాజవరేణ్య! యెఱుంగఁజెప్పితిన్. ౪౨

క॥ కానియొకసందియము కల
దీనరలోకాధిపతుల కెల్ల రకును న
మ్మానిజననుతుఁడు గొల్లఁడు
గానిన్నృపుఁడుగాఁడఁటంచుఁ, గలదివచింతున్. ౪౩

క॥ నారాయణుండు ధరణీ
భారము వారింప యాదవకులమ్మునఁ జె
న్నారెన్ గృష్ణుండన నీ
కారసి తెల్పితినిఁ గడురహస్యంబైనన్ ౪౪

క॥ చకితులగు లోకులకు వెఱ
నకటీలదుగాన నొకయుపాయము కడునె
న్నికయగుగతిఁ దెల్పెద వా
రక చాటింపుము స్వయంవరము జగమెల్లన్ ౪౫

ఉ॥ నీకొమరెన్ వరింప ధరణీపతులెల్ల రహంక్రియామనో
ద్రేకమెలర్పరాఁగలరు తెల్లముగా నపుడీవు మత్స్యయం
త్రాకలనమ్మునన్ జయమునందిన సుందరుఁడీకుమారికన్
జేకొనునట్లుగాఁ బ్రతినచేయుముపాయము న్యాయమైతగన్. ౪౬

ఉ॥ దానికిఁగృష్ణుఁడొక్కరుఁడు దక్కఁదదన్యులశక్తులాతఁడ
మ్మాని జలమ్మునందుఁగని యుప్పరవీధిని మత్స్యయంత్రముం
బొనరుకంగలాఁ డతని పోడిమి యన్యుల కబ్బనేర్చునే
యానరరథ్యచోదకునికడ్డమె? యెంతటి రాజచంద్రులున్. ౪౭

మ॥ జయలక్ష్మీలలనామనోహరుఁడు కృష్ణస్వామి నీపుత్రికిన్
ప్రియుఁడై యొప్పెడి నిక్కమియ్యది నృపుల్ పేరెత్తి పైవచ్చినన్
లయమందింపఁగఁజాలకున్నె శిశుపాలధ్వంసి నీకేల ని
ర్భయమార్గీతి నెనర్పుమిట్లు, శుభముల్ వాటిల్లు నాయానతిన్. ౪౮

క॥ అనుపలుకులువిని నృపవరుఁ
డనుమోదము చెందె మానియరిగెం దనయు
చ్ఛను లక్షణకున్ మనమ
మ్మనసిజజనకుపయి మాటిమాటికిఁ బ్రాలెన్ ౪౯

తే॥గీ॥ అంత నరపతి పురమునకరిగె లక్ష
ణాంగనామణి యంతఃపురాంతరమున
కేగెఁ జెలికత్తెలందఱు నిండ్లు చేరి
రరుణుఁడరుణప్రభాంకితకిరణుఁడయ్యె. ౫౦

ఆశ్వాసాంతపద్యములు.

---

క॥ ఫార్షిభాషాప్రజ్ఞో
త్కర్షాకర్షిత యశోధికా శంకరసం
కర్షణసమబుద్ధియుత య
మర్షస్వీకృతివిరహిత మానితచరితా. ౫౧

స్రగ్విణి॥ పాకనాట్యన్వయా బంధురాలంక్రియా
శ్రీకళత్రాంఘ్రిసంసేవనాప్తోదయా
గోకిరెడ్డ్యాప్తసంగుప్తకీర్తి గుణా
లోకనైకప్రియా లోలుభత్వాప్రియా. ౫౨

పంచచామరము.

ధరామరస్థిరాదరా వృథావిధోక్త్యనాదరా
నిరంతరానురక్తిచిహ్న నిత్యపోషితప్రజా
వరాభిధేయవస్తుతత్త్వపండితా యశోన్వితా
ధరావరేశ్వరా సమస్తధర్మమర్మభాస్వరా. ౫౩

గద్య.

ఇది...శ్రీ తిరుపతివేంకటీయ లక్షణాపరిణయంబను
మహాప్రబంధమ్మునందుఁ బ్రథమాశ్వాసము
సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

తిరుపతివేంకటీయము.

# లక్షణాపరిణయము.

## ద్వితీయాశ్వాసము.



శ్రీకర లోకోన్నత సుగు
ణాకర యౌవనకళావిహార సుకవితా
పాకవివేకముగలకవి
రాకకలరువేల్పుగిడ్డి రామారెడ్డీ.

తే॥గీ॥ అవధరింపు మనంతరంబబ్జబంధు
నందు రాగాతిశయమెక్కుడై చెలంగె
స్వగతుఁడగు హరి వరుఁగఁగోర గమకించు
లక్షణకుగలరక్తిఁదెల్పనెయనంగ. ౨

క॥ అంబుజబంధుఁడుపూర్ణత
రంబై యర్ధమయి కొంతరాణించియు సూ
క్ష్మంబై తగుబింబమునఁ గ్ర
మంబుగఁ దాఁబశ్చిమాద్రిమాటున కరిగెన్. ౩

క॥ హరిదశ్వుఁడు తనగృహమున
కరుదెంచెనటంచుఁ బశ్చిమాంబుధి మఱులన్
గరమునఁ గానుకొసంగఁద
దరుణచ్ఛవిఁబొల్చెననఁగ నరుణుండెసఁగెన్. ౪

తే॥గీ॥ పశ్చిమాచలమునఁ గాంతిపరిధవిల్లెఁ
గాని తూరుపుఁగొండరిక్తదశనందె
"యొకఁడు చెడిపోవుపైఁగాని యొకఁడు బాగు
పడుటలే" దని జనులాడుపలుకు నిజము. ౫

తే॥గీ॥ వారకాంతనువదలి యంభోరుహాప్తుఁ
డరిగినంతన యద్దాని నంటుకొనఁగఁ
దమమరుగుదెంచె, వారకాంతలకుఁ దగిన
వాఁడువిడిన దురవస్థ వచ్చుటరుదె. ౬

ఉ॥ అంబుజముల్ చలించెఁ బతగావళి గూళ్లకు నేగుదెంచెఁ ద
రంబులనుండి విప్రులు కరంబుల డంబుగ నీరుకావివ
స్త్రంబులసంపుటంబులుఁ బూనఁగ గృహంబుల కేగుదెంచిర
భ్రంబున సంజతగ్గె విరఁబాఱెఁదమంబు క్రమంబుగా దెసల్. ౭

తే॥గీ॥ కొండలన్నియుఁ గాటుకకొండలయ్యెఁ
జెట్టులన్నియుఁ జీఁకటిచెట్టులయ్యెఁ
బండులన్నియు నేరెడిపండులయ్యె
నేమనఁగవచ్చుఁ దామసిదీమసంబు. ౮

ఆ॥వె॥ జలజ జలజబంధు శరదాభ్రములయందుఁ
గలుగురాగమెల్లఁ గలసి జార
జారిణీ మనఃప్రచారంబుగావింపఁ
బోలు లేకయున్నఁ బోవుటెట్లు. ౯

తే॥గీ॥ గగనమనుగని పెకలించి కాలపురుషుఁ
డందుఁగలవజ్రములఁబయి నమరఁబెట్టు
చున్నపోలికఁ గ్రమముగా నొక్కటొకటి
గాఁ బ్రకాశించెఁ దారకల్గములుగట్టి. ౧౦

చ॥ వెలవెలబాఱెఁదూర్పుదెస వేవిళులొప్పినమీఁద గర్భిణీ
లలనమొగంబువోలె శుభలక్షణలక్షితుఁడై దిగంగనా
తిలకముసొంపునన్ దగి ప్రతిక్షణవర్ధితకాంతిసంపదల్
చెలఁగఁగఁ జందురుండుపొడిచెన్ సగపాలుతమంబడంగఁగన్. ౧౧

క॥ కలువలపాలిఁటి పున్నెము
కులుకుంజవరాంద్రపాలికోరిక గజదాం
గలపాలిఁటి మృత్యువు వె
న్నెలరాయఁడు వెలిఁగె సింహిణీశత్రుండై. ౧౨

క॥ కేరెఁ జకోరములెల్ల వి
చారమ్మున మునిఁగెఁ జక్రజంపతులు జలం
బూరెన్నెలరాలఁ జే
కూరెన్ దంపతులకింపు కొలఁకులు తేటన్. ౧౩

తే॥గీ॥ పద్మినీకాంత తనుఁజూచి పసలునవ్వ
గాత్రినగసాగెదానిఁ గైరవిణి చెలఁగి
యోరి కేనియు నమవసయోగుమీఁద
రాణనెసఁగెఁ బున్నమ రాకపోదు. ౧౪

వ॥ ఇట్లు చంద్రుండు విజృంభించుటయు.

ఉ॥ నారదుఁడేలవచ్చె? జననాయకుప్రోలకు, వచ్చెఁగాక తా
మారుసిఁగన్నసుందరునిమాటల నెత్తఁగనేల? యొత్తెఁగా
కారమణీమనోహరునియందును నామది కెక్కనేల? "నా
కోరికదీర్చువారెవరొకో? యిఁకు" డంచు మదిందలంచుచున్. ౧౫

మ॥ అనురాగంబది కన్నుఁగానదు మనంబౌమిట్టిపల్లమ్ములన్
గనకెచ్చోటకునైననేగు నిఁకనేడ్కల్ మంచియున్ జెడ్డయున్
మనుపేనేగి మన్మథుండు చపలాత్ముండెంతయున్మూర్ఖుఁ డం
గనలన్ లోకువఁజేసి మీఁదఁబడు శక్యంబే? నివారింపఁగన్. ౧౬

క॥ అనిపలుదెరఁగుల మనమున
జననాయకపుత్రి పరిబలసంశయడోలా
వినిహితమగు తనహితమును
కనుమతలగు చెలులు లేమి నటుచూచుతఱిన్. ౧౭

ఉ॥ నెచ్చెలు లేగుదెంచి ధరణీపతిపుత్రికఁ గాంచి తద్వ్యథం
బచ్చుపడంగ నెంచి ప్రియమారఁగ డగ్గరఁ జేరి యెంతయున్
బొచ్చెము లేనికూర్మి పొలుపున్ దెలుపన్ విరహాగ్ని పైపయిన్
హెచ్చఁగఁ బచ్చవింటిదొర హెచ్చులునున్ బయిపెచ్చులై తగన్. ౧౮

క॥ పొదలుటకు సంశయించుచు
ముదితకుఁ దామిట్టులనిరి ముద్దియలు బళీ
యిది యేమి వింత? తాపా
స్పదమయ్యె లతాంగి! మేను క్షణకాలమునన్. ౧౯

చ॥ కుచములఁ దారహారములఁ గ్రొంబొగ రేఁగుట యేమి? చందనం
బుచిటిలు టేమి? మేను తెలుపుం బలుపెక్కుట యేమి యింతలో
విచికిలగంధి నీకుఁ గనువేఁదుఱు గల్గిన హేతు వేమి? యిం
తచపలత న్వెసంగను విధం బది యేమి? యెఱుంగఁ జెప్పుమా. ౨౦

క॥ నీవై ఖరిచూచిన నీ
భావంబల తుంటవింటివానికి నిలయై
భావము గనెనని తోఁచెడి
బైవారమొ? యేమొ నీకుఁ బద్మదళాక్షీ. ౨౧

క॥ కావున నీ నెమ్మదిఁ గల
యావత్సంగతులు చెప్పుమందుఁ గల కా
ర్యావసరము గనుఁగొందము
నీవారికిఁ దెలియకుండ నీరజనేత్రా. ౨౨

వ॥ అని గ్రుచ్చి గ్రుచ్చి యడుగు నెచ్చెలులకచ్చెలిమిన్న గన్నననిట్లనియె. ౨౩

ఉ॥ చెప్పెడిదేమి నాకుఁ గలచేవయుఁ బ్రోవయు మీర కాదె? మీ
యొప్పని కార్యమందు మది నుంచెడిదాననె? మీకుఁ జెప్పుటల్
తప్పునె? తప్పఁగల్గునె? విధానమెఱింగిన ప్రోడలైన మీ
రెప్పని సేయఁజాల? రిదియెంతటి కార్యము మీరు పూనినన్. ౨౪

ఉ॥ నారదమౌనివచ్చి జననాయకు ముందరఁ గృష్ణచర్య లిం
పార విపంచికారవము హాయిగఁ గూర్చి వచించెఁ, జించెన
మ్మారుఁడు నామనంబు పలుమారు శరమ్ములనించినించి, యో
సారసగంధులార! యొకసక్కెము చేసెదరేమొ? నెమ్మదిన్. ౨౫

చ॥ అవనివరుండు నమ్మునివరాగ్రణియాన స్వయంవరమ్ము సే
యవలయునంచు నెంచె నపుడా మురవైరి యనుగ్రహించి యీ
యువనికి రాక యున్న మనమానలఁ జేసెడిదేమి వానికో
క్కనిపయమౌనె? నానలపుకాంతలు వేనకువేలు గల్గఁగన్. ౨౬

సీ॥ ఎముకలొమ్ముదిగక నెమ్మదికెక్కు పలుతక్కులాదవించు రుక్మిణీయువతి
కన్నఁ, దోడఁ జేరికడుమీఱి గడిదేరి ప్రౌఢయై ప్రేమచూపెడి సత్యభా
మకన్న, నును కెంపుకనునింపులను జూపు నుంకించి భయపెట్టి కలఁచు
జాంబవతికన్నఁ, జలమూని తలఁపాని వలపేని యతిఁజేసి లీల నోలార్చు
కాళిందికన్న;

తే॥గీ॥ నెచటఁ దొరకిన నచటన యిండ్లకడకు
లాగికొనిపోవు గొల్ల యిల్లాండ్రకన్నఁ
జక్కఁదనమున్న దాననో? చాకచక్య
మున్న దాననొ? యేను దామోదరునకు. ౨౭

వ॥ అని పట్టరానితమకమ్మున నెట్టకేలకు గుట్టు చెడి నెట్టగమునెట్టుకొని యు
ట్టునట్టును దోఁపఁ మఱఁదనపుతో. ౨౮

సీ॥ ఆరుక్మిణీదేవి కధరంబవైతేని యధరమా! తదధరసుధ లభించు
నాసత్యభామకు హస్తంబవైతేని హస్తమా! యతనికేలంటఁ గల్గు
నాజాంబవతికి వక్షోజంబవేని వక్షోజమా! తన్నఖాంకురములొలయు
నాసుదంతకుఁ గన్నులై జనించితిరేనిఁ గనులార! యతనిఁ గన్గొనఁగ నబ్బు;

తే॥గీ॥ తుదకు నొక గొల్లసుదతికిఁ బదములైతి
రేని చరణమ్ములార! యాతేనివాళి
మానసన లభించు నారీతిమాని నన్ను
నాశ్రయించితి రేమి భాగ్యమ్ము గల్గె? ౨౯

ఉ॥ ఈగతిదూతిదూతి యొకయింతయుఁదాళఁగలేక మూర్ఛవో
గాఁగని నెచ్చెలుల్ చలువగందము గుబ్బలఁబూసి సీతలో
ద్యోగములెన్నియేనియును తోఁచినవట్టు నొనర్చి తేర్చి యిం
కేగతినిర్వహింతుమని యెంచి తలంచుచు నున్నయంతటన్. ౪౩

తే॥గీ॥ కెలనఁ బంజరమునను న్న చిలుక వలికె
నేల? యీలీలయోజింప నేనుగల్గఁ
గృష్ణునెఱుఁగనొ? ద్వారకకేగలేనొ?
కార్యమునుబొత్తువఱచెడి గతులెఱుఁగనొ? ౪౪

ఉ॥ మున్నొకనాఁడుచూచితిని ముచ్చటమీఱఁగ ద్వారకాపురం
బన్నగవైరిప్రోలు నగజాధిపువీడు రమేశురాజధా
నిన్నగఁజాలునన్నగరినిచ్చలుఁగాపుగమున్న భూసురుల్
జన్నములందుఁ బ్రోడలు విశాలయశుల్ నిగమాంతకోవిదుల్. ౪౫

ఉ॥ వారలపాండితీమహిమ వారలయోగ్యత వారితీరు న
న్వారికిఁగానువర్ణనము వారలతేజము వారిసంపదల్
వారికుటుంబవైఖరులు వారిపరోపకృతిస్వభావముల్
వారిజసంభవుండయిన వర్ణనసేయఁగలేఁడొకింతయున్. ౪౬

క॥ అదియేమిచింతయో యొక
పదియేడులు వచ్చువఱకె పదముల్ గ్రమముల్
సదముట్టఁజెప్పనేర్తురు
చదువులకిక్కలగు బ్రహ్మచారులు నగరిన్ ౪౭

ఉ॥ కత్తులపైఁబరీక్షనిడఁగాఁదగు వేదము, శాస్త్రమన్నమీ
చిత్తమువచ్చినంత యిఁకఁజెప్పెడిదేమి కవిత్వమన్న పే
రెత్తి జయింపశక్యమె మహేశ్వరికేని, సమస్తవిద్యల
ప్పత్తనభూసురాగ్రణులపాలనరాదె? మఱింతయేటికిన్. ౪౮

ఉ॥ రాజులకేమి? సంపదలరాజిలువారలు పేరె? తత్పురిన్
రాజులు నిర్జితప్రథితరాజులు రక్షితవేదశాస్త్రని
వ్రాజులు సమ్మదాయితనరాజులు సంపదలందుమేటిగా
రాజులు కీర్తినిర్మలితరాజులు రాజులుభోగసంపదన్. ౪౯

తే॥గీ॥ కోమటులసంపదలను బేర్కొనఁగ నేల
యాదియంతమ్ము నొందియు నాదియంత
మనుగనక మధ్యమమ్ములై చను ననేక
ములు మణులు వజ్రములు రత్నములును నెలమి. ౫౦

తే॥గీ॥ విష్ణుపదజాలు సదసద్వివేక మెఱిఁగి
తగుననంతాప్తిచే మహానందమునుగాంచి
సాధునిసంసేవనము గల్గి విధివిహితగ
తులనతులవై ఖరుల నొప్పుదురు పురమున. ౫౧

ఉ॥ అప్పరివారకామినుల యందముచందముటుండనిండు బల్
కుప్పలుగాధనంబు పదికోటులొసంగినఁగాని నీచునిన్
జెప్పలువిప్పిచూడరుసరేకద! విద్యలుసూపిద్రవ్యమున్
గొప్పగసంగ్రహించి యనుకూలురఁగూడి సుఖింతురెంతయున్. ౫౨

ఉ॥ అందమునందుఁ దన్నగరమందలి గొల్లవెలందులే మను
ష్యందనగంధులం గెలువఁజాలుదురన్న ధనాంగనామణీ
బృందమునెన్న నేల? పురవీధులఁ బూవులనమ్మువోఁట్లతోఁ
డందాలఁదూఁగ నేర్చునె బెడంగున రంభయు గింభ యేనియున్. ౫౩

ఉ॥ పూవులతోఁటలా? ముదముఁబుట్టఁగఁజేసెడి మేటితావులా
తావులతేవులా? మణులుపన్నిన మేల్కడానిమేడలా
మావులతావులా? మధురమంజులకోకిలకాకలీకలా
ద్రావములా? మనోహరము తత్పురమెన్నిఁట నెన్నిచూచినన్. ౫౪

క॥ ఆపురమునేలికొనెడి మ
హాపురుషుఁడుకాఁడె? కృష్ణుఁడనఁగ, నతనితోఁ
రూపమున నన్యవిధమున,
నేపురుషులు సాటివత్తురే భువనమునన్. ౫౫

సీ॥ పురిటింటనున్నయప్పుడ పూతననుఁ గొట్టి మేటివిఖ్యాతిచే మించినాఁడు
అతిబాల్యమైనప్రాయమున మద్దులఁ గూల్చి యందరానియశమ్ము నందినాఁడు, అంతకింతైన ప్రాయమ్ములోనన దావదవము మ్రింగి ప్రశస్తి దవిలినాఁడు, అంతకొక్కింత హెచ్చైన ప్రాయముననే నగమెత్తి సత్కీర్తి నెగడినాఁడు;

తే॥గీ॥ కాళియాహిమదంబడఁగంగఁ ద్రొక్కి
కంసుహింసించెఁ దనవారికష్టము బాపెఁ
బెండ్లియాడెఁ గుచేలుఁగు బేరుఁజేసె
నాతఁడగుఁగాదె? శ్రీకృష్ణుఁడతివలార. ౫౬

క॥ పదియారువేలచెలులకు
మదనుండై వెన్నపెరుఁగు మఱపించి ముదం
బొదవఁగఁ దిని బలిపిన కో
విదమాన్యుఁడతండు గుఱుతు నెఱిఁగనేలా. ౫౭

ఉ॥ ఆతనిచిత్రమేమొ యొకఁడయ్యును నందఱికన్నిరూపులై
వ్రేతలసౌఖ్యఁ జేయుచును వేయువిధమ్ముల మెప్పులంది త
చ్చేతములందు నెప్పుడును సింపు నటంచును జెప్పవింటి మా
జ్ఞాతులఁ జూడఁ బోయి యొకనాఁడు నిజమ్ముగ నమ్ముఁ డింతయున్. ౫౮

చ॥ అను శుకరాజుమాటలు హృదబ్జము బిట్టలరింప నెచ్చెలుల్
విని గదియంగఁ జేరి పృథివీవరపుత్రికఁ గాంచి సీమన
మ్మునఁ గలకొల్లలుపలరఁ బూర్తియొనర్పఁగఁ బూనినట్టిసీ
యనుఁగుశుకమ్ముమాట వినవమ్మ మనఃపరితాపమాఱఁగన్. ౫౯

చ॥ పులుఁగులకెట్టికార్యములు పూనఁగఁ జెల్లదటంట్రు నెంచఁగా
నలనపదల్లనాఁడు దమయంతికి నన్నలుతోడ నేస్తమున్
గలుపదె, యొక్కయంచ? గనఁగా నివిక్రొత్తలె? తత్తదున్నత
స్థలములకేగఁ జెల్లునె? వెసన్ మఱియొక్కరి కెంతవారికిన్. ౬౦

శా॥ ద్వారమ్ముల్ పనిలేదు కోటలనినన్ దాఁటుల్ తగంతస్థితా
గారంబుల్ సొరశంక లేదు పులుఁగుల్ గాకిట్టి కార్యమ్ము లె
వ్వారల్ దీర్పఁగలారు? నీమనమునన్ బాటిల్లు తాపమ్ము నీ
కీరాగ్రేసరుతోడఁ జెప్పఁదగదే? కీరేశ్వరాలాపినీ. ౬౧

ఉ॥ అమ్మరో! యిట్టికార్యములయందిటు జాగొనరింపరాదు వే
గమ్ముగ నీమనోరథము గాదలి చిల్కకుఁ జెప్పి వంపు జా
లమ్మొనరింపఁబోకుము విలంబము చెట్టయగున్ ,,శుభస్యశీ
ఘ్రమ్మని చెప్పినన్ వినవుగా తడవాయె నిశీథమేగనన్. ౬౨

క॥ అని మాటిమాటికిని బో
ధన చేసెడి చెలుల పలుకు దనరఁగఁ గని నె
క్కొని మఱియు మఱియు బోధిం
చిన మెల్లనఁ జిల్కతోడఁ జెలి యిట్లనియెన్. ౬౩

క॥ రమ్మనుమీ సైపుట భా
రమ్మనుమీ విరహమతిభరమ్మనుమీ వా
రమ్మనుమీ న్యాసనధి సుదూ
రమ్మనుమీ పుర స్వయంవరమ్మనుమి తెగన్. ౬౪

క॥ చలమనుమీ సురునకు ని
శ్చలమనుమీ మనమ్ము నాబచలమనుమీ దృగం
చలమన్యులపై నిదిచం
చలమానిని గాదటంచు శౌరికిఁ జెపుమీ. ౬౫

క॥ మొక్కితిననుమీ తనకుం
గక్కితిననుమీ విశేషతాపభరమునన్
సొక్కితిననుమీ మిగులన్
జిక్కితిననుమీ స్వయమ్ముగఁ జెప్పితిననుమీ ౬౬

క॥ అనుమానమేల? నిక్కము
నినుమాననటంచుఁ బలికె నెలఁతుక పేర్మిన్
జనుమాన మొసఁగుమనుమా
చనుమా కనుమా కృపానుసారిన్ శౌరిన్. ౬౭

క॥ విగులరులు నగులునుగులు హి
మగుచియునక్రిమరుచి పికమాద్యద్భృంగ
స్వరమురుభీకరతామే
మఱి కిదియంతయును దెల్పుమా నగహారికిన్. ౬౮

ఉ॥ అనియనుపన్ శుకంబరిగె సంచితసంచితపుణ్యగణ్య స
జ్జనధననందనందనలసత్పదపద్మరజోనుషంగస
ద్మనిభృతవాసభాసురమదప్రమదామ్యనుగానదానదే
వనిచయమై తనర్చునలద్వారకకున్ గరుబంతచారియై. ౬౯

తే॥గీ॥ కుక్కుటములంతఁ గొక్కొరుకోయటంచు
దిక్కులందింపుకించుకి తెల్విదోఁచెఁ
జుక్కపొడిచెఁ బోయినక్కసఁజూడఁజూడ
దీపములు తెల్లవారె సంతాపమాఱె. ౭౦

శా॥ చోరుల్ తాఱిరి తారకల్ జాఱెగ గచ్ఛన్వీచ్ఛుఁగాజారిణీ
జారుల్ వాఱిరి మానుఁడున్ మఱలెఁ గాసారంపుఁదీరమ్ములం
జాఱుల్ సేరిరి దూరమేగుపథికుల్ మార్గమ్ములంబట్టి రం
భోరుఝాంకరభపూరపూరితములై పొల్పారెనుందెమ్మెరల్. ౭౧

సీ॥ అభిసారికాంగనావ్యభిచారములు తగ్గెఁ దమము తూరుపుపర్వతమ్ము
డిగ్గెఁ, గువలయమ్ములరంగు దప్పగప్పులమునింగె వెడపింటివాని యాఁగ
డమడంగెఁ, బద్మినీకాంతకుఁ బ్రియుంబునిండారె నంబుజారికి వైభ
వంబుతీఱె, నేకీభవించుచుఁ గోకములే చెలరేఁగె గుడ్లగూబలు కొండ
గుహలడాఁగె;

తే॥గీ॥ ఎంగుమెయి మత్తవన్యుల్ ప్రమింగిప్రమింగి
యొడలెఱుంగనిరతనుల బడలిబడలి
తెలివిఁగనలేని బలుసోమరులకుఁదక్కఁ
దెల్లముగనెల్లవారికిఁ దెల్లవారె. ౭౨

ఉ॥ రంగుగఁ దూర్పుకొండపయిరాజిలు చెట్టునఁబుట్టినట్టి నా
రంగఫలంబనంగఁ గడురమ్యములౌ నరుణప్రభాచ్ఛటల్
నింగినిఁబర్వ బంకజవనీకమనీయత మాటిమాటికిన్
బొంగనహస్కరుండు పొడుపుంగనెఁ జక్రవలోక్యతగన్. 23

తే॥గీ॥ ప్రాజ్ఞగము సూర్యుఁడనుపుత్రుఁ బడయుకతన
సంతసమ్మున దిక్కులకంతరక్త
రాంకనమ్ములు బహుమతి రాణనొసఁగె
నాఁగ నీరెండ చెన్నాగె నాల్గుదెసల. 24

ఉ॥ అంతకు లక్ష్మణాపతియు నాబిడనెచ్చెలులున్ దిగంతర
ప్రాంతనిషక్తదృష్టులయి పల్కరు కీరము రాకచూచుచున్
గింతునురంత తాప మునఁగ్రాగెడి రాతనయున్ బ్రమోదిత
స్వాంతమొనర్ప నేగిరి వసంతునికోటకుఁ బూలతోఁటకున్. 25

సీ॥ గొలలచేఁదూఁగుకదళికల్ ఫలమ్ములఁగొమరారునారికేళములగములు,
చేయెత్తునికుపువృచ్ఛెడి పూగములు కిసాలయములఁ దగురసాలంపుఁ
దరులు, పూలఁబిందెలఁబండ్ల వ్రాలెడి పనసలు పండిన చెఱకులఁ బ్రబ
లుమడులు, నడుగడ్గునకునుజొప్పడు పిల్లకాల్వలు కంటికినింపగుపంట
చేలు;

తే॥గీ॥ చక్రనికొలంకులును మేటిచంద్రకాంత
ఫలకవేదులు కేళికూళులు సుమాళి
మలరుకేళీగృహమ్ములు పొలుపు దెలుపు
వలపుజిలికెడియుద్యానవనమునందు. 26

సీ॥ ఉభయపార్శ్వములందునొప్పారు మల్లికాపంక్తితతిసౌందర్యంబు పారఁ
జూచి, దూరదూరమ్ముగాఁ గేరుకోయిలలతోఁ గాలఁదూఁగుమామిడుల
సరసియరిసి, జలజలరాలు పుష్పములకుప్పల సౌరభముఘ్రేల్చు పొగ
డవృక్షములుగాంచి, మలయవాయువులచేఁ గలయఁబర్వెడిపరాగ
ములనొప్పెడి నికుంజములనెంచి;

ఉ॥ పోతి నిశీథమం దపుడు బోటులకూటములందు నమ్మురా
రాతి విలాససౌధముల రంజిలు నాసమయమ్మునందు నీ
కాతనిదర్శనం బెటులనబ్బెను? యేగతివిన్నవించితో
చేతము చల్లనౌనటులఁ జెప్పఁగరాదె సవిస్తరమ్ముగన్. ౮౪

చ॥ కువలయనేత్ర సారెకును గోరికలీరిక లెత్త నీగతిం
దవిలి పునఃపునఃప్రకలితమ్మగు నాదరముం దురమ్ముగా
నపరిశమై రసప్రసరమైతగు వాక్యపరంపరన్ గడుం
జవిదళుకొత్తఁ బల్కెనవెసన్ శుకరాజవతంసమిట్లనున్. ౮౫

క॥ ఏసరుగువఱకుఁ గారణ
మే నెఱుఁగనుగాని యాతఁదెఱిగినయటులన్
దానొకఁడు నొక్కఁడై యో
మానిని సౌధాగ్రమందు మసలుచునుండెన్. ౮౬

చ॥ ఎలమిఁ బచారుసేయు జలజేక్షణుఁ దవ్వులఁ గాంచి కార్యమున్
ఫలితమగుంగదా యనుచుఁ బక్షములన్ ధ్వని రేఁగకుండ ని
శ్చలగతి నాతఁడున్న మణిసౌధము పొంతకునేగి తద్గవా
క్షులనడుమన్ దృగంచలముసాచి గృహాంతరమెల్లఁ జూచితిన్. ౮౭

చ॥ చిలుకలుకొన్ని పంజరవిశేషములన్ గనుపట్టె నంత లో
పలికివెసన్ జనంగ నొకపద్మదళాక్షియు లేకపోయె నా
తలఁపున సందియంబగుఁగదా! యపుడేమి యొనర్పఁగావలెన్
జలజదళాక్షుఁడైన నొకచందనగంధియు లేకపోవునే. ౮౮

వ॥ ఇట్లు సంశయించి వెండియు.

సీ॥ కారుకమ్ముల నేలఁగాఁ జాలె నెమ్మేను నెమలిపించియును పెన్నెఱుల నొప్పె
గరముల శంఖచక్రములు పేర్మి నెసంగె వనమాల గళమున నెనసి ప్రేలె
గౌస్తుభంబక్కుపైఁ గళలనీనఁగ సాగె శ్రీవత్సమును వింత చెలువు తెలిపెఁ
బీతాంబరంబు విస్ఫీతమై కనుపట్టె వేణువా మోవిపై రాణ నలరె;

తే॥గీ॥ తళుకుఁగలగొల్లదొరల బల్టెక్కులెల్ల
చక్కనగుఫక్కిఁగన్పట్టి నిక్కమితఁడు
కృష్ణుఁడేయని యోజించి కెలననుండి
యెదుట వ్రాలితి నాతఁడునదిరిచూడ. ౫౯

చ॥ చెలఁదిరో యేమిచెప్పనగు వెన్నునివింతలు, నన్నుఁజూచి యో
చిలుక! భవత్సఖీమణికి సేమమె పెండిలి యానవెప్పుడ
య్యలికులవేణి కేనృపునియం దనురాగముగల్గె? నీకునుం
దెలియకపోదు నాకుఁ దగఁదెల్పుము పెండిలికేనువచ్చెదన్. ౬౦

చ॥ అనివదనమ్మునన్ బలుచనై నను లేనగవంకురింప నన్
గని యొకసక్కఫుంగతిని గంజవిలోచనుఁడాడె నాతడే
యనువున నీమనోరథము నాఁగనె నయ్యమెఱుంగు నాసుఁదోఁ
చెనవుగా నారదుండరిగి చెప్పినటంచుఁ గుఱంగలోచనా. ౬౧

చ॥ అదియునుగాదు నిక్క, మతఁడాతనితో నిన్నుఁ జెప్పఁగాక నీ
మదిఁగలమర్మ మెట్లతని మానసమందెఱి? నటుండనిమ్ము నా
కిది కడుఁబెద్దవింత! నను నీవనువం జనినట్టిదానిఁగా
నెదనెటునిశ్చయించె? జగదీశ్వరుఁ డాతఁడెఱుంగకుండునే. ౬౨

వ॥ అంత నేనును మహానుభావుండగు నతనికి నమస్కరించి వినయమ్మునని
ట్లంటి. ౬౩

క॥ దేవా! నీవెఱుఁగనికత
లేవిటన్ గలుగు? నీకు నేనెఱిఁగింపం
గావలయునె? పునరుక్తము
గావలయునె? యంచుఁ జెప్పఁగాఁ దొరకొంటిన్. ౬౪

తే॥గీ॥ భూసరోజముఖీమణి భూషణంబు
సప్తభూమికహాటకసౌధవరము
సకలసంపద్విభాసుర జనచయంబు
మద్రములకెల్ల తనరారు మద్రపురము. ౬౫

క॥ పాఱులుధృతనిగమవ్రా
తారులు సమధీతనిగమపారులు జితకో
పారులు సమస్తశాస్త్ర
పారులు దారులు నజాతపాపులనగరిన్. ౯౬

ఉ॥ అచ్చటిరాచవారు కలనైనను బోరులనోరగారు వి
వ్వచ్చునినైన మెచ్చరిల భార్గవరాముఁడు నేఁడునున్నఁ బై
పెచ్చువిపించుకొందుమని బీరము బేరములాడుచుండ్రు కాల్
గ్రుచ్చినఁ బాఁపరాతలలకున్ దలవంపులొనర్తు రెంతయున్. ౯౭

ఉ॥ తాతలనాఁటి పాఁతులకతమ్మున నాతనికొండలేముగా
కాతఁడు మమ్ముఁబోలె ధనమార్జనచేసెనెయంచు నూరుసం
జాతపుజాతినారచట జక్కులరాయని లెక్కసేయరే
పాఁతులులేకరో ధనసుపారముగా గడియించిమించుటల్. ౯౮

క॥ పాదజులెల్లరు ద్విజసే
వాదరు లత్యంతవిభవు లప్పురియందా
మోదంపఁ దగనివస్తువు
వేదొక్కటియేనియును నళీకంబేలా. ౯౯

వ॥ అట్టిపురమ్మున కధీశ్వరుండు.

క॥ కలఁడు బృహత్సేనధరా
తలనాథుం, డతఁడు మిగులధర్మాత్ముండా
లలితునకు నొక్కకూఁతురు
సెలఁగున్ లక్షణయటంచుఁ జెప్పఁగరాపెన్. ౧౦౦

ఉ॥ మాచెలియంచుఁ జెప్పికొనుమాటలుగావివి యామెఁబోలనా
మాచెలి యయ్యుమాసతియు మారునినారియు మారుగారు దే
వా! చెలులుందురాఁగడ పదాఱుసహస్రము లప్పురమ్మునం
దా చెలియందమందలి పదాఱవతీరున మాఱునేర్తురే. ౧౦౧

వ॥ అనివెండియు.

సీ॥ నీలంపుమణులు మా నెలఁత పెన్నెఱులంటి వడఁతిగుబ్బలు దబ్బపండు
లంటి, దానిమ్మగింజలు తరుణిదంతములంటి మగువ కెమ్మోవి బింబఫల
మంటి, చెలిమిన్న నూఁగారు చీమలబారంటిఁ గలికివళుల్ తరంగమ్ము
లంటి, వనజాస్యనాసిక కనకపుష్పంబంటి వెలఁదికన్నులు పద్మదళ
ములంటి;

తే॥గీ॥ సకియ నెమ్మోము పూర్ణిమాచంద్రుఁడంటి
కొమ్మ పెందొడలంటికంబమ్ములంటి
నడుము సున్నంటిఁ బొక్కిలి సుడియటంటిఁ
దగు నునుసిరంటి రమ్మని తగులుకొంటి. ౧౦౨

క॥ కరములు సిరిజశోభా
కరములు గళ మెన్న దరనిగళమగు నఖరాం
కురములు హిమకరరేఖాం
కురములు పదములును విజితకోకనదమ్ముల్. ౧౦౩

ఉ॥ బంగరుబొమ్మ సంపఁగులవట్టు చొకాటపుటిక్క మేలు మేల్
రంగులకుప్ప మారునిశరంబు రసంబులతేట వజ్రపున్
ముంగర నేరుపుందళుకు ముద్దులమూట వరాలపేట మా
యంగన, దానిఁబోలఁ గలయంగన లేదని నొక్కిచెప్పితిన్. ౧౦౪

ఉ॥ నారదమౌని వచ్చి జననాయకు నొద్ద నొకింతగా భవ
చ్చారుతరప్రభావముల చందమునందమునుందగన్ మనం
బూరఁగఁ జేయుచుం దెలిపె నోయదునందన! తత్క్షణంబ నీ
పై గురిచివెట్టె మా చెలియ, వట్టఁగ శక్యముగాదదేరికిన్. ౧౦౫

క॥ అళులనిన నులికిపడు నె
చ్చెలులన్నన్ గసరుఁ బికవిశేషధ్వనికిన్
దలఁకు శశియన్న నులుకున్
జిలుకలకొలికియళు కేమి చెప్పఁగవచ్చున్. ౧౦౬

చ॥ నిను నుతియించు నిన్ గసరు నీవనిన్ దలయెత్తి చూచుఁ దా
నినుఁ బలుమారునుం దలఁచు నీదుకథాసుధఁ గ్రోలు నంతట
న్నినుఁ గను నిన్ను మ్రొక్కు మఱినిన్ను వినున్ నినుఁ బాడు మాటికి
న్నినుఁ బలవించు నిన్వెదకు నీమయమంతయు మాలతాంగికిన్. ౧౦౭

ఉ॥ చక్కనివాఁడవీవు నెఱజాణలజాణ నరేంద్రకన్య బల్
టక్కరివీవు సొంపగు బెడంగున మేటినృపాలబాల నీ
వక్కమలాస్యకుం దగుదు వక్కమలాస్యయు నీకుఁ జాలుఁ దా
మ్రొక్కెనుతించె వేఁడికొనె మంచినఁ దేల్చిన నీవసుమ్మికన్. ౧౦౮

క॥ అనినీ చెప్పిన సంగతు
లను శతగుణముగ నొనర్చి లలితగతుల బో
ధనచేసి "వత్తునిట" కని
యనిపించితి హాస్తమందు హాస్తంబిడియోన్. ౧౦౯

చ॥ అనిచిలుకాడుమాటలు హృదబ్జముబిట్టలరింప లక్షణా
వనజముఖీలలామ ముఖవారిజ మంకురితస్మితమ్ముగాఁ
జనవునఁ జిల్క కుక్కెరలు చక్కెరలుం దనిపించె నార్తకా
మినులకు దూతలోకతతి మేటివరమ్ములొసంగు దైవముల్. ౧౧౦

తే॥గీ॥ అంతనెచ్చెలులిట్లని రానరేంద్ర
పుత్రితో "నీదుకార్యమ్ము పొత్తుపఱచి
నట్టి చిల్కకు సమ్మానమాచరించి
చిల్కతేజీదొరను వెలిఁజేయనగునె" ౧౧౧

మ॥ అనఁ జూజాయలనత్తలోదరియుఁ దానంగీకృతిం దెల్పె న
వ్వనజాస్యల్ నృపపుత్రితోఁ సరసిలో వాలాయమోలాడి యొ
డ్డునకున్ వచ్చి కురుల్ విదిర్చికొని పట్టుంబుట్టముల్ గట్టి నె
క్కొని భూషల్ ధరియించి బొట్టులిడి కోర్కుల్ మిన్నుముట్టన్ దగన్

సీ॥ కిలకిలమనుచుఁగోకిలలుగూసెడిచోట నళిదంపతులగానమమరుచోటఁ
జిలుకముత్తైదువుల్గలసియాడెడిచోటఁ గేకులుపురివిచ్చికెరలుచోట
నల్లిబిల్లిగలతలల్లియొప్పెడిచోటఁ బుష్పపరాగంబువ్రేలయుచోటఁ
బిల్లవాయువులుసంప్రీతిఁజేసెడిచోటశారికల్సురతముల్సలుపుచోటఁ
తే॥గీ॥ పూలఁబిందెలఁ దులఁదూఁగినేలకంటు
గుజ్జులేనును మామిడిగులుకుచోట
సపరివారమ్ముగాఁ బుష్పశరునినిలిపి
యతనివామాంకమున రతిననువుపఱచి. ౧౧౩

క॥ ఆవాహనాదివిధుల ము
దావహముగ మదనదేవునర్చించి సఖుల్
పూవుందోయిలిగొని యా
దేవునిమదినిల్పికొని నుతించిరిభక్తిన్. ౧౧౪

సీ॥ మదనాయ తారుణ్యసదనాయ శుభ్రాంశువదనాయ దేవ తుభ్యంన
మోస్తు, మారాయ వైరాగ్యచోరాయ భృతకీరవారాయ దేవ తు
భ్యంనమోస్తు, కామాయ సహచరతోసమాయ విరహిణీవామాయ
దేవ తుభ్యంనమోస్తు, తరుణాయ సౌందర్యవరణాయ శంబరహ
రణాయ దేవ తుభ్యంనమోస్తు;
తే॥గీ॥ పంకరుహసాయకాయ తుభ్యంనమోస్తు
పద్మజాదినుతాయ తుభ్యంనమోస్తు
పరమపుణ్యకథాయ తుభ్యంనమోస్తు
భార్గవీనందనాయ తుభ్యంనమోస్తు. ౧౧౫

చ॥ నలు దమయంతితోఁ గలిపినావు సుదర్శనుతోడఁ బేర్మిలీ
లలువ్రేలయంగ నాశశికలాలలితాంగినిఁ గూర్చినావు నీ
విలఁగల యొల్లదంపతుల కేలికవై జగదాదిహేతువై
చెలఁగెడివాఁడ పీసతికి శ్రీహరి పొందొడఁగూర్పఁజాలవే. ౧౧౬

చ॥ అనినుతియించి యావనితలందఱుఁ గందళితాంతరంగులై
యనుఁగుసఖీమణిం గలసి యంతిపురమ్మున నాపెడించి యా
జ్ఞనుగొని యిండ్లకేగిరి వెసన్ జలజాప్తుఁడు నంతఁ దీక్ష్ణ వ
ర్తనుఁడయి మధ్యమాంబరపదమ్మున డంబుగ నొప్పె నిచ్చలున్. ౧౧౭

తే॥గీ॥ అవనిపతి భోజనాదికృత్యములు దీర్చి
కవులు మంత్రులు పండితుల్ గలసికొలువఁ
దరుణశరదిందుముఖులు చామరలువీవ
నిండుకొలువుండెఁ గన్నులపండువలర. ౧౧౮

ఉ॥ నారదుఁడాడినట్టి వచనమ్ములు మంత్రులతోడఁ జెప్పి మే
లారసి పుత్రికామణికి నాయదునందనుపై విరాళియున్
బాఱుఱెఱింగి చారులను బంచెఁ దగన్ శుభలేఖలిచ్చి వి
స్తారధరాతలేశ్వరుల సంఘములన్ బిలువంగ నత్తఱిన్. ౧౧౯

ఆశ్వాసాంతపద్యములు.

కం॥ శ్రీశారదాకటాక్షా
వేశ సమావేశ సంప్రవృద్ధఖ్యాతీ
దేశాయి దేశముఖము
ఖ్యాశాశ్రుత బిరుదశాలి యాత్తగుణాళీ. ౧౨౦

చ॥ హితమితభాషితా పరిచితేతరహృద్గతభావవేత్త్రతే
ప్సితసఫలీకృతిప్రతినివేశితగౌరవబుద్ధి నిష్కళం
కితచరితా కవిత్వరసకేవలతత్పర సత్పరాయణా
అతిపరిపక్వచిత్త వరమాద్భుతవృత్త మహాగుణోత్తరా. ౧౨౧

స్రగ్విణి. తాటకోండాఖ్య సద్గ్రామధామా నిరా
ఘాట సామర్థ్యయుక్తా మహాశాంత యు
త్పాటితక్రోధ సంప్రాప్తబోధా యస
త్పాట విచ్ఛేదనాయత్త చిత్తాంచితా. ౧౨౨

గద్య.

ఇది శ్రీ... తిరుపతివేంకటీయ లక్షణాపరిణయంబను
మహాప్రబంధమ్మునందు ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

| పే | పం | త | ఒ | పే | పం | త | ఒ |
|---|---|---|---|---|---|---|---|
| 7 | 19 | దాజఁ | దాఁజ | 8 | 12 | మందిరప్ర | మందిప్ర |
| 9 | 14 | వారగుఱునెఁ | నెఱుఁగువార | 10 | 7 | వృద్దిబొం | వృద్ధిఁబొం |
| 16 | 12 | మునకు | ములకు | 19 | 4 | కిృడ | కీృడ |
| 29 | 19 | కిర | కీర | 35 | 8 | నాగఁ | నాఁగ |
| 42 | 21 | తోఁడఁ | తోఁడఁ | | | | |

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః.

తిరుపతివేంకటీయము.

# లక్షణాపరిణయము.

## తృతీయాశ్వాసము.



శ్రీరామచంద్రపదప
ద్మారాధననియతహృదయ! హరగహారయశ
శ్శ్రీరుచిర! నిరుపమదయా
ర్ద్రా! రక్షితపండితేంద్ర రామనరేంద్రా.

తే॥గీ॥ అవధరింపుమనంతరం బట్లునంద
నందనుఁడు చిల్క చెప్పిన యందచంద
ములు మనమ్మునఁ నాటి యమ్ముద్దుగుమ్మ
కన్నులకుఁ గట్టినట్లుగాఁ గళవళించు. ౨

ఉ॥ అంతకుమున్న విన్న చెలువగ్గలమై తలకెక్కి రుక్మిణీ
కాంతునకంతకంతకును గంతునిదంతివచించినట్టి య
య్యింతివిలాసముల్ మరునికేపుఘటించి తదన్యకాంతలం
దెంతయు నేవగింపులగియుంపఁగఁ జేసెనదేమివింతయో. 3

సీ॥ రుక్మిణితోఁబొత్తు రుచియింపదాయెఁగా దాయఁగాఁదోఁచె సుదంత
వింత, సాత్రాజితియటన్న శతృత్వమాయెఁగా మాయగాఁదోఁచె
జాంబవతిపేర్మి, రాధికాసతిచెలిమి రహిలేకపోయెఁగా పాయఁగాఁదోఁచె
నాభద్రపేర్మి, నీలపొందడవి వెన్నెలపోలికాయెఁగా కాయగాఁదోఁచె
నర్కసుతమమత;

తే॥గీ॥ వన్నెగల గొల్లకన్నెల చిన్నెలన్ని
యెన్నికకు రాకమునుమున్న వన్నెదఱిగె
చిన్నిచిన్నారిచిన్నెలు వెన్నుదన్న
లక్షణామయుఁడయ్యెఁ బద్మేక్షణుండు. ౪

సీ॥ సందియంబందె భీష్మకరాజనందన సత్యభామకొకింత శంకవొడమె
రాధకుమునువ్రాలె రసమొసంగకపోయె భద్రకునీరస భావమొదవె
కళలుజాఱుటతప్పెఁగాళిందికెంతయు ననుమానముసుదంతకినుమడించె
జాంబవతికిఁబూర్వసారస్యమొసఁగాయె నీలకునునుపటిబాళితఱిగె;
తే॥గీ॥ లక్షణాధీనుఁడైన పద్మాక్షుఁపొందు
సుందరులకందఱికిఁ గ్రొత్తచందమాయెఁ
గాంతులమనమ్ము లన్యసంగతములైనఁ
దెలివిగలపోఁడిచెలులకుఁ దెలియఁబడవె. ౫

చ॥ తమకుఁ బరస్పరమ్ముగల తామసముల్ విడనాడియందఱుఁ
గుమిగొనికృష్ణుచర్యలను గొంతవడిఁ గలపోసి యంత స
క్కమలదళాక్షు చిత్తమధికమ్ముగ లక్షణయందుఁజిక్కుటల్
క్రమముగఁ గినకంతిగఁ దగఁ దెలియంగఁ దనూదరీమణుల్. ౬

క॥ "మనమనుభవింపఁగా మిఁగి
లిన సౌఖ్యంబనుభవించు నే" యంచు నొక
ర్తనుఁ దానికేమియదియును
మనవంటిదె పో" మ్మటంచు మఱియొకతెయనుఁ. ౭

ఉ॥ చాలమటంచునింక నొకసారసగంధినిఁ గూర్చనెంచెనో
యాలలితాంగి యందమునకంకటికెక్కుడటంచుఁ దోఁచెనో
స్త్రీలుపదాఱువేలుగల చెల్వునకేమని యాసచేసెనో
యాలలనాశిరోమణి, బళా? కలరే? మనవంటి వెఱ్ఱులుఁ. ౮

క॥ తరుణికొక పురుషునందుం
దిరముగ మదినిల్చుఁగాని తెఱవలయందుఁ
దఱచుగఁ బురుషులకొకచో
గుఱినిల్చుట కాన మేమొకో? తరళాక్షీ. ౯

క॥ మనచందమెచ్చుటను మే
దినిఁ గనవినరాదు వింత తెరువిది లోక
మ్మునఁ బురుషులిట్టివారలు
వినఁబడిరే? పురాణములను నేకములందున్. ౧౦

చ॥ ఇతరమృగాక్షులందుఁ గలనేనిమదింజొరనీక సంతతం
బతివయొకర్తుగా నియమమందెడి సుందరులైన పూరుషుల్
వెతకిననెందు నేనిఁ బృథివింగలరేముకొ యంచు సంశయా
హతమగు నామనం, బటువబ్బిన గుబ్బెతపుణ్యమన్యమే. ౧౧

క॥ అనిపలువిధములఁ గృష్ణుని
వనజాననలెల్ల వారివారిమదికిఁదోఁ
చినభంగి నాడకొని రం
గన లన్యస్వాంతుఁగాంతుఁగని యోరుతురే. ౧౨

సీ॥ చిలుకపోయినత్రోవ పలుమారుఁ దిలకించుఁ దిలకించినిట్టూర్పు వెలికి
విడుచు, విడిచియుంచుకసేపు తడబాటుమదిఁదాల్చుఁ దాల్చి కందమ్ము
లంతలుగఁజేయుఁ, జేసి లోలోనవిశ్వాసమ్ముసంధించు సంధించి యచ్చా
సచందమెంచు, నెంచినుచ్చటలాడ నించుకగమకించు గమకించితన
లోనఁ గళవళించుఁ;

తే॥గీ॥ గళవళించి యుపత్రపఁగాంచిమించు
మించియోజించు యోజించి మేలుగాంచుఁ
గాంచిచింతించుఁ జింతించికంతునెంచు
నెంచి “దయయుంచు”మని పలవించు శౌరి. ౧౩

సీ॥ తాబృహత్సేనుఁడై తనకువాఁడయ్యుబృహత్సేనసుతకునై యాసచేయుఁ,
దాబహులక్షణాధారుఁడయ్యును నొక్కలక్షణాతరుణీవిలాసమెంచుఁ,
దాఁబయోధరపయోధరహారియయ్యు సత్తలునీపయోధరమ్ములకుఁ
దలకుఁ, దా దావఘోరాగ్నిఁ దాఁగువాఁడయ్యు నయ్యంగనావిరహా
గ్నికటమటించు;

తే॥గీ॥ దానవంగునిఁగన్నట్టి తండ్రియయ్యు
నయ్యనంగుని శిక్షింప నడరుగాంచుఁ
దాజగన్మోహనుండయ్యుఁ దద్గతైక
మోహినీమోహ వార్ణిధి మునిఁగితేలు. ౧౪

క॥ ఈగతిఁ గృష్ణుండెంతయు
వేఁగుచు నుద్యానమునకు వెడలియచట నా
నాగమవీక్షాకలనో
ద్యోగమ్మునఁ బ్రొద్దుపుచ్చుచుండెఁదనంతన్. ౧౫

ఉ॥ అంతటనేగుదెంచిరి స్వయంవరలేఖలుఁగొంచుఁ జారు ల
క్ష్మాంతునిఁ గన్నతండ్రి కెసకమ్మున విన్నపమాచరింపఁ, గం
సాంతకుఁడాదరమ్మున స్వయంవరలేఖ పఠించిలోన ను
క్కింత దిటమ్ముపూని చనియెన్ దనమేడకు నిశ్చితాత్ముఁడై. ౧౬

తే॥గీ॥ లక్షణాచంద్రముఖియు విలక్షణార్తి
నలసిసొలసి "స్వయంవరమగుటయెప్డు
కృష్ణసందర్శనంబగు టెప్డు నామ
నోవ్యథలు తీఱుటెప్పు" డనుచుఁ గడంగి. ౧౭

ఉ॥ ద్వారకయున్నదిక్కునకుఁ దద్దయు దృష్టినిగుప్పుచున్ సఖీ
వారము తత్పురీపథమువంకకునంపుచు మాటిమాటికిన్
మారుని దూఱుచున్ మలయమంద సమీరకుమారుఁగేరుచున్
వారిజనాభునిన్ హృదయవారిజమందుఁ బసందుచేయుచున్. ౧౮

తే॥గీ॥ అవధిదినములు పలుమారు నరసికొనుచు
గణనచేయుచుఁ గాలదైర్ఘ్యమ్మునకు న
సూయచెందుచుఁ గుందుచునాయశోది
కాతనయుఁగూర్చి కాలమ్ముగడపునంత. ౧౯

ఉ॥ వచ్చిరిరాజపుత్రులని వారణవారణులై తురంగరం
గచ్ఛతురంగులై జయసఖండరథోద్ధతులై నిరస్తవి
ద్యుచ్ఛలనాసిభాసురకరోద్ధుర సారసనాదిసాదిభా
స్వచ్ఛతురంతయాన విలసత్పరివార జనానుయాతులై. ౨౦

ఉ॥ అంగజతేజఁ డుజ్జ్వలితహారకిరీటమణీవిభూషణా
భంగురకాయుఁ డాయతకృపారస బంధురమానసుండు వ
చ్చెం గమలాక్షుఁ డుత్సుకతచెన్నలరార రథాధిరూఢుఁడై
మంగళసంగతంబయిన మద్రధరాధిపురాజధానికిన్. ౨౧

ఉ॥ నెచ్చెలులేగియంత ధరణీవరుపుత్త్రికఁ గాంచి "వచ్చెవి
వ్వచ్చునిబావ" యంచుఁ దెలుపన్ నలపంకురమంది యంతలో
హెచ్చి మనోవికారములనేకములన్ సృజియించె నేవునన్
వచ్చును? బచ్చవింటిదొరవైఖరు లాఁగఁగ నేరిశక్యమా. ౨౨

చ॥ ఒకతె వచించు నావెనుక నొక్కతె సెప్పు ననంతరంబు వే
ఱొకతెయు మీఁద నొక్కతెయు నొక్కతె చెప్పినమాట వేఱొక
ర్తుకమదినెంచ కిట్లు పలుగూపులఁ జెప్పిరి మద్రరాజక
న్యకకు మురారిరాక, శుభమానెడ వార్తలపౌనరుక్త్యముల్. ౨౩

సీ॥ హరివచ్చెనని చెప్పె నసుఁగు నెచ్చెలియోర్తు సరసిజాక్షుండని సకియ
యొకతె, పద్మనాభుండనెఁ బడఁతిమిన్న యొకర్తు వనమాలియనెఁ జం
ద్రవదనయొకతె, బర్హభూషణుఁడనెఁ బద్మనేత్రయొకర్తు చక్రహ
స్తుండనెఁ జానయొకతె, వేణుభాసురుఁడనె వెలఁదియింకొక్కర్తు కౌ
స్తుభాన్వితుఁడనెఁ గాంతయొకతె;

తే॥గీ॥ కలికియొక్కతె శ్రీవత్సకలితుఁ డనియె
నతివయొక్కతె పీతాంబరాఢ్యుఁ డనియె
యదుకుమారకుఁ డనె నొక్కయంచయాన
కృష్ణుఁ డనిచెప్పె వేఱొక్కకీరవాణి. ౨౪

తే॥గీ॥ ఎచటఁ జూచినరాజన్య లెచటదృష్టి
నించినను గుఱ్ఱముల్ గజానీకములును
నెచటఁగనుఁగొన్న రథము లిల్లెల్లయెడల
దంతురంబయ్యె మద్రపురాంతరంబు. ౨౫

క॥ అంత బృహత్సేనధరా
కాంతుం డెల్లరకుఁ దగినగౌరవములతో
నెంతయు సన్మానించి య
నంతరమున మత్స్యయంత్ర మాసాదించెన్. ౨౬

ఉ॥ పిమ్మట రాజులెల్లఁ బృథివీపతి పిల్వఁగఁబంప మత్స్యయం
త్రమ్ము సమీపమందుఁ గల రచ్చ నెలర్చెడి చంద్రకాంతపీ
ఠమ్ములఁ దారతమ్యము గడల్కొన నాల్కొని రంబుజాక్షుఁడున్
సమ్మతి నెక్కెనొక్కవిలసన్మణి పీఠము నార్యచర్యుఁడై. ౨౭

ఉ॥ చూచెడివారు యంత్రమిది చోద్యమటంచుఁ గలంచువారు "నా
రాచపువిద్దెకుం దగినరచ్చ యిదే" యనువారు "వారిలోఁ
జూచుచు దీనిఁగొట్టనలెఁ జూచినఁ గా" దనువారు "నహ్వరే
రాచకొమార్తె నేలఁగల రా[illegible]ఁడో" యను వారు భూపతుల్. ౨౮

మ॥ వయసాక్కింత యతీతమౌ నృపతులన్ వాలాయమీక్షించి పే
ర్వయసున్ రాజకుమారులందఱు నసహ్యన్ జొచ్చి రాశ్చర్యమౌ
నయసుల్ దస్సినమీఁదఁ గన్నియలపై వాంఛల్ పిసాళించు నా
రియ యోగ్యస్థితు లేరికేనియును బూరించున్ గిసాభాసముల్. ౨౯

ఉ॥ నందకుమారు రాకకతనం దెలిసృంగిన మోముతోఁ గన
త్సుందరమందహాసకలతోఁ గులదూఁగుచు గంధశాలి నిం
పుందళుకొత్తు నున్ విరహపుం దెలిచాయలతోడ లక్షణా
చందనగంధి వచ్చె సగసంపుగతిన్ మితభూషితస్థితిన్. ౩౦

ఉ॥ గాదిలి రాచకన్నియ నెగా దిగఁ జూచుచు రాకుమారు "లీ
మాదిరి సుందరీమణి సమాసచరప్రమదాళులందుఁ గా
కోదర రాజసంభవ తలోదరులందును లే" దటంచు నా
మోదము సందియమ్మును ప్రమోదమునుం గని రందఱుం దగన్. ౩౧

ఉ॥ అంత నృపాలకుం డొకఁడు హస్తమునన్ ధనువున్ ధరించి య
త్యంతము నేర్పుగల్గినటు లాకసమందలి మత్స్యయంత్ర మొ
క్కింతగ నీటఁజూచి శరమేసెను బారెడు హెచ్చుతగ్గుగా
"నెంతటివింటివిద్య" యని యెల్లనృపుల్ దనుఁజూచి నవ్వఁగన్. ౩౨

ఉ॥ ఇంచుక దుస్సిపోవ నొకఁడేసె మఱొక్కఁడు లక్ష్య మెద్దియో
యెంచక బాణముం జెఱిచె నేమనవచ్చు నొకండు లక్షణా
చంచలనేత్రపై మనము జాఱినవాఁడగుటన్ మఱొక్కఁడో
నించె శరంబు, నందఱును నివ్వెఱఁగందె తనుం గనుంగొనన్. 33

శా॥ అంతన్ గంతునిఁగన్న తండ్రి సుకరాంతానందసంధాయియై
ప్రాంతస్థావనిపాలకుల్ శిరములన్ వంపన్ సహాసంబుగ
భ్రాంతిం దెల్పుచు బంగరుం బటము పైపై జాఱ సందీపితా
శాంతుం డై యవలీలమైఁ గురిసె మత్స్యాకారమున్ యంత్రమున్.

ఉ॥ త్రుంచినయంతమాత్రమున దుందుభులాకసమందు మ్రోసె వా
యించి రనేక వాద్యముల నిచ్చట, నచ్చటనచ్చరల్ ప్రశం
సించిరి లక్షణాసతియుఁ జెచ్చెరవచ్చి మధూకమాల నుం
కించి తగిల్చె సిగ్గిలుచుఁ గృష్ణుని కంఠమునందుఁ బొందుగన్. 34

వ॥ ఇట్లు లక్షణ కృష్ణు వరించుటయు నచ్చటి రాజులందఱును.

ఉ॥ గొల్లఁడు రాచకన్నెను దిగుల్కొనిపోవఁగ రాజులారా? మీ
యుల్లములందు సిగ్గువడ కూరక పోయెద రేల? రండు భీ
తిల్లుట రాచపాడియె? ముదించిన పీనిమసంబడంచి యీ
పల్లవపాణికిం దగిన వానికిఁ బెండ్లియొనర్తమంచొగిన్. 35

చ॥ అనవినమీఱఁ గొందఱు కటారులు దీసిరి కొంతమంది క
న్గననెఱసంజచాయలొలుకన్ ధనువుల్ శరముల్ ధరించి యుత్త
క్కునగనలేక గొల్లనికిఁ గూఁతు నొసంగుపురయ్య యేటిరా
జు" యనుచు మద్రభూపతిని సారెకు దూఱఁగడంగి రెంతయున్. 36

వ॥ ఇట్లు రాజులందఱును నొక్కపెట్టు హరిపైఁ గనయుటయు.

సీ॥ బవరమ్ము వచ్చె దైవమ? యంచు లక్షణాసాంసారిక్కికి గుండెజల్లుమనఁగ
రాజవైరంబు సంప్రాప్తించెనని మద్రధరణీశునకుఁ గాళ్లు తడఁబడంగ
మీనయంత్రము ద్రుంపలేని రాజుల కేటిపౌరుషంబని పౌరవరులు దూఱ
నిరాజమణులెంత యీసుమానిసులంచుఁ జదలగీర్వాణులాశ్చర్యమంద

తే॥గీ॥ పట్టుపుట్టంబు నడుమునఁ బిట్టుచుట్టి
హరిణతతిమీఁద దుముకుసింహంబు పగిదిఁ
చక్ర మొకకేల ధరియించి సరసిజాక్షుఁ
డవనిపాలురపై నిర్భయముగ నుఱికె. ౮౦

వ॥ ఇట్లుఱికి సంవర్తసమయ ధారాధరమ్ము నడువున శరాసారమ్ములం బఱపి చీకాకుగావించిన. ౮౧

ఉ॥ ఆనృపవీరులందఱు స్వయంవర వైఖరు లెంచికొంచు లో
లోనఁ జలమ్ము లజ్జయును బోలతయున్ దలవంపునింప ము
న్మానినమార్గముంగొని త్వరోద్ధురులై చని రంత నాబృహ
త్సేనుఁడు కృష్ణుఁడోడికొని సేనలుగొల్వఁగ నేగెఁ గోటకున్. ౮౨

తే॥గీ॥ అంతలక్షణకును జలజాక్షునకును
మంగళస్నానమొనరించి రఁగనాజ
నములు మంగళవాద్యముల్ గొమరుమిగుల
వేదఘోషమ్ములందంద విస్తరిల్ల. ౮౩

మ॥ తలయంటెన్ జలజాక్షియొక్కతె లలత్తైలమ్ము కంసారికిన్
నలుగుం బెట్టె మఱొక్కతేమ హరికిన్నానెంపుఁ గాలాగురున్
జలకం బార్చె నిఁకొక్కచాన హిమవాస్సారమ్మునన్ జక్రికిన్
జెలి వేఱొక్కతె నున్గురుల్ దగవిదిర్చెన్ గోరులన్ దువ్వుచున్. ౮౪

తే॥గీ॥ మురిపెములనొప్ప నవ్వధూవరుల నుచిత
భూషణాంబరముల నింపువుట్టఁదగ న
లంకరించియథోచిత లక్షణముల
వేదిఁ గైసేయఁజేసిరి పేరటాండ్రు. ౮౫

క॥ శ్రుతిహితముగ నతులితముగ
ధృతకుతుకస్వాంతులగుచు ద్విజులు శుభసమ
న్వితగతిఁ బెండ్లియొనర్చిరి
సతీపతులకిర్వురకు నెసకమెసఁగంగన్. ౮౬

శా॥ కట్టెన్ గేలుసెమర్ప మానసముపొంగన్ గోర్కులాకాశమున్
ముట్టన్ మంగళసూత్రమంగజకళాపూర్ణుండు కృష్ణుండు మేల్
రెట్టింపన్ బగులక్షణాగళమునన్ లీలామహావాద్యముల్
ధట్టింపన్ దదుదారదివ్యతరసౌందర్యమ్ము నీక్షించుచున్. ౪౭

ఉ॥ „నాతిచరామి" యన్న వచనార్థమెఱుంగును లేదొ యమ్మురా
రాతి వఠించి యచ్చెలిశిరమ్మున హస్తము వెట్టె బిట్టుప్రే
మాతిశయమ్మునన్ గురువరానుమతిన్, బదియాఱువేలపై
చేతులఁ దక్కుభార్యలఁ దగ్గజింపఁదలంచెను లక్షణార్థమై ౪౮

తే॥గీ॥ మురిపెమొక్కింత లోనఁ దత్తరమొకింత
సందియమొకింతయును సంతసమ్మొకింత
గలసి యొకవింత పుట్టింపఁ జెలియమిన్న
వల్లవీలోలుపైఁ దలఁబ్రాలువ్రాసె. ౪౯

సీ॥ మంగళం లక్షణామానినీకమనాయ మంగళం త్రైలోక్యమండనాయ
మంగళం వల్లవీమానసాధారాయ మంగళం యదువంశమానితాయ
మంగళం గోగోపమండలతారిణాయ మంగళం మానిసంభావితాయ
మంగళం సత్యభామాపదానుచరాయ మంగళం రాధికామన్మధాయ;
తే॥గీ॥ మంగళంమంగళం గోపపుంగవాయ
మంగళంమంగళం సర్వమంగళాయ
మంగళంమంగళం మృదుమానసాయ
యనుచు నారతులెత్తిరి వనజముఖులు. ౫౦

తే॥గీ॥ శ్రుతిహితమ్ముగ విప్రులుశ్రుతులు సెప్పఁ
బుణ్యసతులెల్ల మంగళమ్ములను బాడ
వెలవెలందులు నాట్యముల్ విస్తరింప
లక్షణను బెండ్లియాడెఁ బద్మేక్షణుండు. ౫౧

తే॥గీ॥ ప్రమదమొప్పఁగ నైదుదినములు నేగ
నంతనగరోత్సవమ్ము చేయంగఁదలఁచి
మించుసదలంకృతులను భూషించిరెలమి
లక్షణాతరుణీ సరోజేక్షణులను. ౫౨

సీ॥ మల్లెమొగ్గలు వెట్టి మణిసరమ్ములు చుట్టి జడకుసింగారమ్ము గడలుకొల్పి
రతనంపునత్తు వజ్రపుబులాకీపొత్తుగలిపి నాసకు వింతచెలువుగొలిపి
పలుహారములచేతఁ బచ్చికస్తురిపూఁతగుబ్బచన్నులకుమేల్గుస్తరించి
దొడ్డచీరలగించి యొడ్డాణముబిగించి లేఁతనెన్నడుమున కూఁతయొసఁగి;

తే॥గీ॥ పసపు పూసియుఁ బారాణి యొసఁగి పదస
రసిజములకుఁ బసందగువస ఘటించి
పలుచనగుగతి బాహులఁ గలప మలఁది
లక్షణ నలంకరించిరి లక్షణముగ. ౫౩

సీ॥ పలుఫలాహారముల్ చలువపన్నీరుమేలత్తరుల్ చిత్తరుల్ హాళినెలయ,
నెత్తంపుఁబలకవీణియ తమ్మలంపుఁజిల్కలు పూలబంతులు మెలపుదె
లుప, చిటిచాపచెలువునించెడు పట్టుదిండియల్ బంగారుకలశముల్
పసనెసంగ, ముక్కాలుపీట బల్ చక్కనికుర్చీలు సేద్దుగులోబులు చె
లువుమలఁప;

తే॥గీ॥ దోమతెర జోడు పఱపులతోఁ జెలంగు
బంగరుంబని దంతపుఁబట్టెమంచ
మందు సింగారముగ యదునందనుండు
చెలువపై మది పరుగిడ నలరుచుండె. ౫౪

తే॥గీ॥ అంత లక్షణఁ దోడ్కొని యనుఁగుఁజెలులు
కేళికాగారతోరణ పాళిదరికి
హాళిఁ జెన్నార నెక్కొకయడుగుఁవరుస
నరిగి లక్షణ కనిరి హాస్యంపుగతుల ౫౫

ఉ॥ “ఎన్నఁడుగాని కన్నియల హేలలెఱుంగని వన్నెలాఁడు మా
వెన్నుఁడు వెఱ్ఱిగొల్ల, పృథివీపతిపుత్త్రిక వీవు వన్నెలుం
జిన్నెలునేర్చుదాన వటుచెల్లును మీకుఁ బరస్పరం” బటం
చు న్నళినాక్షు నెంచె నొకసుందరి కృష్ణునెఱుంగ నట్లుగన్. ౫౬

క॥ "పలుకుసుదతులచేతులలో
మెలఁగినవాఁ డతని నెట్లు మెప్పించెదొ? యో
కలికి" యని వేఱొకచెలి
పలికెన్ గలమాటతెలుపుభంగి పొసంగన్. ౫౭

క॥ పలుపలుకులేల రాధా
లలనయన్ మదనశాస్త్ర లక్షణవతి యా
వెలఁదుకకు దాసుఁడై కడు
నలిగినవాఁ డతఁడు మెచ్చునారులు గలరే. ౫౮

క॥ అని పలువిధములఁ జెలు ల
వ్వనజానన గేలిసేయ వనజముఖి యొక
ర్తను "నతఁడు నేర్చికొనె మన
వనితయు నేర్చికొను నతనివలనఁ దనంతన్". ౫౯

తే॥గీ॥ నేర్చికొననేల? వన్నెచిన్నెలన వయసుఁ
బడుచులకు నెల్లరకును స్వాభావికమ్ము
లనుచుఁ దమలోనఁ దమరాడుకొనుచు నెయ్య
నెయ్య శయ్యకుఁదార్చి రయ్యువిద నెలమి. ౬౦

తే॥గీ॥ సిగ్గునను మ్రగ్గుచున్న యచ్చెలియఁ గృష్ణు
దరికి రాఁదీసి యొకప్రోడఁ దనవుఁ గలికి
పలుకులం దెంతయును నేర్పు దొలకరింప
నింపులు జనింప నతనితో నిట్టులనియె. ౬౧

సీ॥ పర్వతమ్ములుగావు పడఁతివక్షోజమ్ము లలరుగుత్తులుసుమీ యద్రిభ
రణ, కాలసర్పముగాఁడు కలికికీలుజడ యళికులమాలసుమి కాళీయద
మన! కరికరమ్ములుగావు కలికినుందొడ లంటిస్తంభముల్ సుమ్ము కంస
కరిహరణ, చక్రముల్ గావు మాజలజాక్షిపిఱుఁదులు సైకతమ్ములు
సుమీ చక్రహస్త;

తే॥గీ॥ మోవి సుమ్మిది పిల్లనగ్రోవి గాదు
రాతనయసుమ్ము చల్లమ్ము వ్రేత గాదు
తెలుపుమర్యాద గావునఁ దెలుపుచుంటి
మెఱుఁగవా! రుక్మిణీసతీహృదయలోల. ౬౨

వ॥ వేఱొక కీరవాణి లక్షణకు మెల్లన నిట్లనియె.

సీ॥ మాటికొక్కటికైన మాటకుత్తరము నీవలెఁగాని యూరకో వలదుసుమ్ము
కెమ్మోవియాననుంకించిన నొయ్యనీవలెఁగాని డాఁచుకో వలదుసుమ్ము
పుక్కిటవిడెమీయఁబోయిననందుకో వలెఁగాని వెలిఁజేయవలదుసుమ్ము
కౌఁగిలించుకొనంగ గమకింప నెదురొత్త వలెఁగాని వెనుదీయవలదుసుమ్ము;

తే॥గీ॥ చిత్తమున కనుగుణముగఁ జెలఁగవలయుఁ
గాని యొక్కెడనైన నొక్కత్రుటికన్నఁ
బెనఁగులాడఁగవలదు సుమ్మనుఁగుకాఁడ
నంగ దైవమ్ముసుమ్ము సన్నతలతాంగి. ౬౩

తే॥గీ॥ ఇట్టులందగు భంగులన్నియు నెఱుఁగఁజేసి
యాతఁడున్నాఁడు నీవుంటెవతివమున్న?
యని పయికిఁజెప్పి యొక్కొక పనినెపమునఁ
జనిరి చెలికత్తెలందఱా స్థలము విడిచి. ౬౪

శా॥ కేలంటెన్ బెరకేలువట్టె మెయి సోకించెన్ మెయిన్ గంఠమున్
గీలించెన్ గుచసీమమంజులగతిన్ గేలుంచె గండస్థలిన్
లాలించెన్ దగఁగౌఁగిలించె మధురాలాపమ్ములన్ దేల్చెఁ గే
ళీలోలుండయి మించె శౌరికడు బాళిన్ లక్షణాభామతోన్. ౬౫

మ॥ అకృతప్రత్యయ మప్రయుక్తవచనం బప్రాపితాలింగనం
బకనద్బంధ మచుంబితాధర మసంప్రాప్తావకాశం బదృ
శ్యకటాక్షంబగు లక్షణానవరతం బానందముంగూర్చె శౌ
రికి, ముగ్ధారత సౌఖ్యసంపదలు వర్ణింపంగ రా వేరికిన్. ౬౬

* సీ॥ ఎండతీడ్చిన సెజ్జయిల్లుచేరనిబోటి చేరివాకిలియోరఁ జేయనేర్చె
నెంతవేఁడిన మొగంబెత్త నేరనిచాన యెత్తి చిఱ్ఱునగవుపల్లొత్త నేర్చె
నిందమంచును విడెమ్మీయ నేరనిలేమ యిచ్చి వాతెఱ యానసీయ నేర్చె
చెయిపట్టిలాగిన సెజ్జయంటనిగోల యంటితోఁబన్నుంటయందియు నేర్చె;

తే॥గీ॥ ముట్టినంతన మాన్పడుముద్దరాలు
ప్రాన్పడక పీల్చాసఁగ నేర్చె రతి కొకింత
యహా! యేరీతిమాతెఁ జేతోంతరంబు
నాతికన్నెరికమ్ము రెండవదినమున. ౬౭

తే॥గీ॥ ఎఱిఁగియు నెఱుంగకుండెడి సురతసుఖము
నొసఁగియు నొసంగకుండెడి యోష్ఠరసము
పలికియును బలుకకయుండు పలుకుతళుకు
కన్నియలకూటములు నెన్నఁగాఁ దరంబె. ౬౮

క॥ ఈగతి నాగజగమనా
భోగమయుండగుచు మద్రపురమునఁ గృష్ణుం
డాగి నొక కొంతకాలము
భోగం బెఱుఁగంగ నీపు పురుషార్థమ్ముల్. ౬౯

తే॥గీ॥ ముగ్ధయై కొంతకాలంబు మురువు సూపె
మధ్యయై కొంతకాలంబు మది గరంచె
ప్రౌఢయై కొంతకాలమ్ము ప్రమద మొసఁగె
లక్షణా చంద్రముఖి సరోజేక్షణునకు. ౭౦

ఉ॥ ఆ యదునందనుం డిటులు హాయిగ నాయలివేణిఁ గూడి ని
త్యాయిత సౌఖ్యముల్ గొనెడి యాసమయమ్మున నైన రాధికా
తోయజనేత్ర యాదిగల తొల్లిఁటి ప్రేఁతల చెల్వు లెంచు నే
చాయల నేరికి న్నలవ శక్యమె? తొల్లిఁటినాఁటికూటముల్. ౭౧

---

* ఈసీసము, వీరిమిత్రులగు, ఆదిభట్ల పద్మాకర కవిచే రచింపఁబడినది.

ఉ॥ శ్రీయవతారమై పొలుపుచెందెడి రుక్మిణియుండ సత్యభా
మాయతనేత్ర యుండఁ దగులాటపునెచ్చెలు లుండ రాధికా
తోయజనేత్ర సంగతులఁ దోయజలోచనుఁ డెంచి మించి యో
హోహో! యనిసొక్కి నెక్కియెడ నెక్కినిమానస మట్లు చిక్కెడున్.

తే॥గీ॥ ఇట్టుల జలజాక్షునకు "బొంది యిచటఁ బ్రాణ
మచట" ననునట్టిసామెత యనువుపడఁగ
సంత నేతెంచెఁ దగ శరదాగమంబు
కలితకాదంబినీకాంతివలిత మగుచు. ౨౩

సీ॥ తెలుపెక్కె మేఘముల్ బలుపెక్కె ఋక్షముల్ తళుకెక్కెఁ దారా రావి
తానములకుఁ, బొలుపొందెఁ జందురుండు తెలివొందెదిక్కులు కాశసూ
నములు ప్రకాశమందెఁ, బస మీఱెఁ బద్మముల్ వెసఁ దేఱె నీరముల్
మల్లియల్ పుష్పించి వెల్లివిరిసెఁ, జెలరేఁగె విరహముల్ తులఁదూఁ
గె సస్యముల్ గాలికిఁ బ్రాగ్దిశాగమన మొదవె;

తే॥గీ॥ నెండ మెండయ్యెఁ గొండలు పండువయ్యెఁ
జలి మొలకలెత్తెఁ దూర్పువర్షములు మొత్తె
నేఱులు కృశించెఁ దిన్నియల్ తారసించె
సురతరుచి హెచ్చె దివికి భాసురత వచ్చె

తే॥గీ॥ అట్టిశరదాగమమ్మునం దంతకంత ౨౪
కధిక మగుచు విరాళి రాధాంగనాశి
రోమణీచర్య లెంచి కూరుములు పెంచి
కృష్ణు నుంకించి తాల్మి జంకించె బళిరె ౨౫

ఉ॥ ఎందఱినైనఁ జూచితి నిఁ కెందఱినైన ననుఁ జూడ నుంటి నో
సుందరి? నీదుచందమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు నవారవిందవదనా? పద నాయెద నాటఁ బోకు మె
న్నందగుదాన వెంతకయినన్ బయి నన్ దయ నంది చూతువే. ౨౬

చ॥ మనగిలిగింతలున్ మనసుశర్మములున్ మనతాఱుమాఱులున్
మనపొలయల్కలున్ మన మనమ్ములనుండెడివింతకోర్కెలున్
మనమన నర్మవాక్యములు మన్ననలున్ మరియాదలున్ మన
మ్మున నెపుడైనఁ గాని తలఁపోయుదువే? సరసీరుహాననా. ౨౨

ఉ॥ వద్దికమీఱి నాఁడు తగువైఖరిగా మితభూషితాంగివై
యద్దమరేయివేళ దళమైనగువెన్నెలలోన నీవు నా
యొద్దకు వచ్చి కౌఁగిలిడి యొక్కటియే కద ముద్దువెట్టి తా
ముద్దుబుఱమ్ముదీర్చుటకు మూఁడుయుగమ్ములు పట్టు నెచ్చెలీ. ౨౩

సీ॥ అర్ధక్షణంబేని యంతరాయము లేని వింతవింతల కౌఁగిలింతలార?
తమినెఱుంగక పొంగుతమకమ్మున నెసంగు హద్దుపద్దులులేని ముద్దులార?
తడఁబాటుతఱిడాసి యొడలెఱుఁగఁజేసిపొగరుచూపెడిగుబ్బపోటులార?
లేనితప్పులుచుట్టి పోనికూర్మిఁబట్టి రవరవఁ దగుచపేటమ్ములార?

తే॥గీ॥ తియ్యఁదియ్యని కెమ్మోవి తేనెలార?
నిగువమానపుదొంతరనిద్రలార?
తమిఁ నెఱుంగనిపురుషాయితమ్ములార?
రాధికాకృష్ణులను విడఁబోదు సుండు. ౨౪

తే॥గీ॥ ఒడలెఱుంగనిపేర్మిఁ గైఁబడెడిపడఁతి
పలుకుపలుకునకును దేహి లోలుకుకలికి
గిల్లినను బాలు గారెడిపల్లవోష్ఠి
పొందు గలవాఁడె పో ధన్యపురుషుఁ డిలను. ౨౫

ఉ॥ ముద్దులచేష్టలన్ మఱచిపోతి సుతారపుఁ బూరుషాయితం
బెద్దడి యామె సోయగపుహేలల కేమి జగమ్మునన్ మఱే
ముద్దియ కుండ కుండు? వలపున్ మొలపింపఁగఁ జేయుశక్తి నీ
యొద్దన పుట్టె నేటొకతె నాదరి నీసరిఁ జేయ నేర్తునే.

ఉ॥ నేరుపెఱుంగనట్టినను నీవకదా? కడుఁ బెద్దఁ జేసి యా
యా రతిరీతులందలి యొయారములన్ గడిదేర్చి యెంతయున్
బారగుఁ జేసి మేలితివి పద్మదళాక్షిరో? నిన్నుఁ బాయఁగా
నేరుచుబల్ కృతఘ్నుఁడను నేరము లెన్నకు మిట్టినావయిన్. ౮౨

సీ॥ నాఁడుగా నిరుపమానందంపుటందంపుఁ జంకంపుఁబొందికల్ పొందఁ
బడుట, నాఁడుగా మిగులవిన్నాణంపునాణెంపురాణంది రాణించు
రస మెసఁగుట, నాఁడుగా యమునాకనత్తటిన్యుత్తటాత్యుత్కట
స్ఫుట కేళి లోఁజపు గనుట, నాఁడుగా రుచిరబృందావనాసేవనా ధా
వనాభావనాధాటి గనుట;

తే॥గీ॥ నాఁడుగా ఘనవేణుగానములసొగసు
నాఁడుగా క్రీడ గావించుప్రోడతనము
నాఁడుగా వేడఁగాఁ బాడి ననుఁ దనుపుట
నాఁడు గలచిన్నె లన్నియు నేఁడు గలవె. ౮౩

చ॥ అనిపలుమాఱు నెమ్మనమునందుఁ దలంచునకాని లక్షణా
వనజముఖీలలామ విసునం గమకింపఁగ లేఁదు శౌరి, యే
మనఁదగుఁ? బల్వేలంపులకు నాసలు చేసెడివారిచిత్త వ
ర్తన, తరణిన్వయార్పితపదద్వయిచందము గాక యుండునే. ౮౪

తే॥గీ॥ ఇటులుం మది రెండు దెఱఁగులై యొఱుగట్టు
చుండినను లక్షణ యెఱుంగకుండఁ గృష్ణుఁ
డనయమును వింతవింతలఁ దనుపుచుండె
నెంతప్రోడయుఁ గాకున్న నిందఱేల. ౮౫

క॥ పయనంబని కృష్ణుండ
మ్మెయి మామకెఱుంగఁజేయ మొలఁతలు బనుపన్
దయ వెన్కఁదీయ నృపుఁ డెం
తయు నాలస్యంబు చేసె ధర్మము కాదే. ౮౬

సీ॥ పోవచ్చునంచుఁ జెప్పుచుఁ గొన్ని నాళ్లు తందర యే మటంచుఁ గొన్నాళ్లు
జరిపి, శుభముహూర్తమ్ములఁ జూచుచుఁ గొన్నాళ్లనంతరం బనుచుఁ
గొన్నాళ్లు జరిపి, నేఁడుగాదంచుమన్నించుచుఁ గొన్నాళ్లునాఁడంచుఁ
జెప్పి కొన్నాళ్లుజరిపి, విందులపై మిష పెట్టుచుఁ గొన్నాళ్లు తెల్లవార
నని గొన్నాళ్లుజరిపి;

తే॥గీ॥ వసపునకుఁ గుంకుమకుఁ గొంత వసతి యొసఁగి
మంచిసుముహూర్తమున బహుమతు లొసంగి
కూఁతు నత్తింటి కంపించెఁ గువలయేశుఁ
డంపుదురె? యంపు మన్నంత నత్తవారు. ౫౭

తే॥గీ॥ సరసిజాక్షుఁడు లక్షణాసహితుఁ డగుచు
నరుగునంతటఁ బురకాంత లతనిఁ జూడ
నేగుదెంచి కనుంగొని రెలమి సప్త
భూమికోన్నత సౌధాగ్రములను నిలిచి. ౫౮

చ॥ మదనునిఁగన్న వాఁ డనెడిమాట నిజంబనె నొక్కనాతి, నా
రదనుతుఁడంట నిక్కమసరాదె యటంచనె నొక్కతేమ, మేల్
యదుకుల మింతపుణ్యదశ నందెఁగదా? యనె నొక్కసాధ్వి, యె
ట్లు నగిరి గొల్లలేమ లతిలోకుఁ డితం డనె నొక్కచానయున్. ౫౯

శా॥ గొల్లల్ గొల్లలటన్న గొల్లలకు యాగొల్లల్, తదీయాంగనల్
ఫుల్లాంభోరుహలోచనల్ మృదురదస్ఫూర్తుల్ కనత్కాంతి వి
ద్యుల్లేఖల్ కరిరాజమందగతు లిందుభ్రాజదాస్యల్ సుతా
ర ల్లీలావతు లేల వేయుపలుకుల్ రంభోర్వశీమేనకల్. ౬౦

క॥ మనవీటన్ జల్లమ్మెడి
వనితలమాటట్టులుంచు వారసతులు నా
వనితల దాస్యమ్మునకై
నను జాల రటంచు నొక్కనాతి వచించెన్. ౬౧

తే॥గీ॥ ఇట్లుపరిపరివిధముల నెంచికొనుచుఁ
బురసతులుసూడ లక్షణాతరుణిఁ గూడి
ద్వారకకు నేగెఁ గృష్ణుఁ, డాతనియువతులు
తమ్ము వదలుటఁ జేసి చిత్తములుగలఁగ. ౯౨

ఉ॥ ఎన్నఁడువచ్చుఁ గృష్ణుఁ డిఁక నెన్నఁడు చూడఁగఁగల్గు వేడ్కమై
నెన్నఁడు కౌఁగిలించుకొను నెన్నఁడు ముద్దిడు నెన్నఁడేలు నిం
కెన్నఁడుతాపహారి మనమెన్నఁడు తిన్నఁబడున్ మనోగతం
బెన్నఁడు తీరునో యనుచు నెన్నఁగరాని వియోగవేదనన్. ౯౩

సీ॥ కృష్ణుసంగతులునీకించుకేనియెఱుంగరావుగా? యని సత్య రాధనడిగె
జలజాక్షుఁడిప్పుడెచ్చటనుండెనొయెఱుంగఁబడెనే? సఖి కనిరాధ భద్రనడిగె
మఱచెనోమనలనెల్లరఁగృష్ణుఁడంచుఁదాపముమీఱనీలతో భద్రవలికె
కర్ణశృంగఖ్యాతి గనుపట్టె నని నీల పతిచందమెంచె జాంబవతితోడ;
తే॥గీ॥ రుక్మిణీదేవి కెఱుక యీరూఢివర్త
మాన మనుచు సుదంత జాంబవతి కనియె
నిటులు పలువిధములను వారెల్లఁ దల్ల
డించి పలవించసాగిరి మించుపేర్మి. ౯౪

ఉ॥ అందఱికన్న రాధ పడునార్తి వచింపఁ దరంబుగాదు కృ
ష్ణుం దలపోసి మండిపడు సోయగ మెంచి తలంకు సారెకున్
గుందు దయావిహీను నెటుకూడితి నే నని మాటిమాటికిన్
నిందయొనర్చుఁ గూర్మి వరనీరజనేత్రల కెక్కుడౌఁగదా. ౯౫

చ॥ రతియననెట్టిదో యెఱుఁగరానితనున్ మదనాగమాంత పం
డితునిఁగఁ జేయుటెల్ల నొకనీరజనేత్రకు నొప్పఁజెప్ప నం
చతఁడు మదిందలంచెనొ? దయాళునిఁగా నెదనమ్మితిన్ గృత
ఘ్నత లెఱుఁగంగవచ్చునె? కనంబడు నంతటిదాఁక నేరికిన్. ౯౬

ఉ॥ కప్పుకొనంగ నాపయఁటఁగాని మఱొక్కటినెల్లఁ డెవ్వరేఁ
జెప్పినమాట నాకెఱుఁగఁజేయక నిద్దురవోఁ డొకప్పుడున్
గప్పురవీడె మొక్కఁడయు కైకొనఁ డామురిపెమ్ము లన్నియున్
దప్పెనొ? యెల్లకాలమొకత్రాటను బోదురె? జారపూరుషుల్. ౯౭

ఉ॥ వల్లభు నెల్ల కన్యయనువాసికి లోఁగక లోకు లాడునా
యల్లరిమాటలోర్చుకొని యన్నిఁటికిం దెగతెంపు చేసి యీ
కల్లరి సౌఖ్యమే సతముగాఁ దలపోసి వరున్ వరించు నా
హల్లకపాణికిన్ జెడుట యబ్రమె? పున్నెముఁ బూరుషార్థముల్. ౯౮

సీ॥ రాకాశరచ్చంద్ర రాజమానానూన చంద్రికాఫలితవృక్షమ్ములార
వికసత్కుసుమగుచ్ఛ విహరమాణాతిగుంజన్మధువ్రత నికుంజమ్ములార
వివిధశృంగార భావితహంసతూలికా తల్పనత్కేళిసౌధమ్ములార
మలయమారుతపోత వలనానుకలనా వితతయమునాసైకతమ్ములార;

తే॥గీ॥ మా వినోదంపుఁజెయ్వులు మంతనములు
కష్టసుఖములు మీ రెఱుంగనివి కావు
మీరలైనను నామపేర్మిని గణించి
వెదకి వేవేగఁ గృష్ణు రప్పింప లేరె. ౯౯

క॥ అని పలువిధములఁ దలఁచుచు
వనజానన యుండె నంత వనజాక్షుఁడు రా
ధ నెపుడు గనుఁ గొందు నె యం
చును వచ్చెన్ దన్ను గొల్లసుదతులు చూడన్. ౧౦౦

చ॥ అదె ప్రియుఁడేగుదెంచె జలజాక్షుఁడువచ్చె మనోహరుండు నా
కదెకనుపట్టె నంచు వనజాననలందఱు చెప్పికొంచు నీ
రదరుచిభాసురున్ హరిఁ గరమ్మునుజూచిరి వాచినట్లు, నె
మ్మదు లతివేలహర్షగరిమన్ భరమూని వశంబుతప్పఁగన్. ౧౦౧

ఉ॥ వచ్చినకృష్ణుఁజూచి వృషభమ్ములు నాలును గోపబాలురున్
హెచ్చినవేడ్క నూరికడకేగిరి ద్వారకయున్ బ్రమోదముల్
పిచ్చిలునట్లుతోఁచె నిటు వేణువిశారదుఁ డేగుదెంచుచో
నిచ్చలు రాధపైఁ బరుగులెత్తఁగఁ దత్తరమావహింపఁగన్. ౧౦౨

చ॥ గడియకొ లేకయొక్క యరగంటకొ కంటఁబడున్ బ్రియుంబు చొ
ప్పడఁ దగఁ గౌఁగిలించికొను బల్ వలపూరఁగముద్దు వెట్టు నె
క్కుడులమకమ్మునన్ మరునికూటములన్ గరఁగించు నింక దుం
దుడుకునుమాను మయ్యదియ తొయ్యలి కేళిగృహంబు చిత్తమా.

కం॥ ఆరాధకేళిసదనము
తారసమగుకొలఁది నిల్లు దనుజహరుసకున్
దోరంబగుఁ దత్తర, మది
ధారుణి ననుభూత మగువిధం బనరాదే. ౧౦౪

ఉ॥ ద్వారముచేరునంత గరిడాపున నారసి రాధికాసఖుల్
గేరుచులోనికేగి ''సఖి! కృష్ణుఁడు వచ్చె'' నటంచుఁదెల్ప సం
భోరుహనేత్ర నమ్మ కటుఁబో గమకింపఁ దలంచునంతలో
సారసలోచనుం డరిగె సారసగంధిగృహమ్ముచెంతకున్. ౧౦౫

ఉ॥ ఇంచుకగాంచి రాధ జలజేక్షణుఁ గంటి నటన్న మోదమో
సంచనచేయునిచ్చయొ స్వభావమొ కృష్ణునిమీఁదికోపమో
యెంచఁగరాదుగాని చనియెన్ జవుజవ్వనఁ గేళికాగృహా
దంచితశయ్యకున్, వడిగఁ దామరసాక్షుఁడు వెంబడింపఁగన్. ౧౦౬

కం॥ ఇటుచని యెఱుఁగనిగతి దు
ప్పటిముసుఁగిడి శయ్యపైని బవళించిన స
త్కుటిలాలకవిధ మెఱిఁగిన
విటశేఖరుఁ డరిగె రాధవెనువెంబడిగన్. ౧౦౭

చ॥ చనిదరిఁజేరి శౌరి పరిచర్యయొనర్చెను ''తప్పుసైఁపుమీ'',
యని బతిమాలసాగెను ''దయన్ గనుమీ'', యని లేని దైన్యమున్
గనుపడఁజేసెనో చరణకంజములంబడి మ్రొక్కెనో వచిం
ప నలవికాదుగాని యలపద్మదళాక్షియుఁ బల్కెనన్నగన్. ౧౦౮

ఉ॥ వారివినోదముల్ మఱియు వారిపరస్పర నర్మవాక్యముల్
వారివిలాసపుంబనులు వారలచెయ్వులు వారికూరుముల్
వారలముచ్చటల్ మఱియువారలతీరులు నిర్ణయింప నె
వ్వారికిశక్యమౌఁ? గవులు వర్ణనచేసెడిపాటివారలే. ౧౦౯

సీ॥ లక్షణ నీరీతి లాలనచేయుదే? యన మంచిదానవే? యనియె శౌరి
యాబోటిపై మనంబతికెనే? యీరీతి, నన లేదులేదులేదనియె శౌరి
ఆయింతికీవింత లన్నియునేర్పితే? యన వెఱ్ఱివాఁడనే? యనియె శౌరి
ఆనాతికీప్రీతియమరెనే? నీమీఁద నన నించుమించుగా ననియె శౌరి;

తే॥గీ॥ ఆలలన యెన్నఁడేని నన్నడిగె నే? యె
టన్న నెఱుఁగును యెఱుఁగదో యనియె శౌరి
చెప్పకుందువె? నాతోడఁ జెప్ప వనిన
నబల? నీకలయిక సాక్షి యనియె? శౌరి. ౧౧౦

తే॥గీ॥ ఇటులనే తక్కఁగల సతులెల్లఁ దన్నుఁ
గోపగింపఁగ నందఱి కోపములను
రస మెసంగెడిగతి నివారణ మొనర్చె
రసికజనశేఖరుం డన రాదె శౌరి. ౧౧౧

తే॥గీ॥ అష్టభార్యల నేలుచు ననవరతము
గోపికలకోర్కె దీర్చుచుఁ గోరువారి
కిహపరమ్ముల నొసఁగుచు నెసక మెసఁగఁ
గృష్ణుఁడు చెలంగె వైభవజిష్ణుఁ డగుచు. ౧౧౨

క॥ ఈ లక్షణాపరిణయము
పోలంగా వ్రాసి చదువుపుణ్యాత్ములకుఁ
శ్రీలలనాధవుఁ డొసఁగుత
మేలగునాయువును సిరియు మేటియశమ్ముఁ. ౧౧౩

## ఆశ్వాసాంత పద్యములు.

క॥ ఆఘూర్ణితానేకాగమ
వాఘ్ఘుర్ణిదినీస్నానపూత పండితసుకవి
వ్యాఘూర్ణిప్రణుత కవీంద్రన
మాఘూర్ణితకావ్య సార యలఘువిచారా. ౧౧౪

శా॥ శ్రీపత్యాద్యతశుద్ధచిత్త పరనారీసోదరీభూత దు
ష్ప్రాపాహంక్రియ గోకిరెడ్డికులపారావారరాకాత మి
త్రాపాలా దయమానదీర్ఘనయనప్రాబల్య సత్యాదృతా
లావశ్రీబల తాటికొండపురపాలా రామభూపాలకా. ౧౧౫

## మంగళమహాశ్రీవృత్తము.

శ్రీలలితమందిరవిశిష్టశుభజాలయుతసేవకజనోచితదయాగ
ద్వాలనరపాలవరభాగ్యక కళాకలితభాగ్యకగుణాకర కృతీంద్రా
తాళనగనామపురధన్యజనపాల జనతావినుతశీలయుతగోత్రా
పాల శుభరామనరపాల జయగోల కవివారనుత మంగళమహాశ్రీ.

ఇది,

శ్రీశేషకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసర
స్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరప్రణీతంబగు లక్షణా
పరిణయం బను మహాప్రబంధమ్మునందు
సర్వంబును దృతీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీకృష్ణార్పణమస్తు.

| పే | ప | త | ఒ |
|---|---|---|---|
| 10 | 2 | సార్ధ | సార్థ |
| 22 | 3 | తత్వ | తత్త్వ |
| 30 | 2 | సీత | శీత |
| 30 | 3 | తోఁచి | దోఁచి |
| 3[illegible] | 20 | లైప | లైఁబ |
| 37 | 24 | వెలుపు | వెలువు |
| 45 | 13 | దాయఁగా | దాయగా |
| 47 | 7 | రెముకో | గేమొకో |

# శ్రీ తిరుపతి వేంకటేశ్వరులొనర్చిన తెలుగు పుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | శ్రవణానందము. | ఈ 4 ను ఒకటి కొకటి తీసిపోని శృంగార గ్రంథములు. | 0—10—0 |
| 2 | లక్షణాపరిణయము. | | 0—6—0 |
| 3 | రసికానందము. | | 0—1—6 |
| 4 | శుకరంభాసంవాదము. | | 0—3—0 |
| 5 | పాండవవిజయము. | ఈ 5 ను మిక్కిలి చిక్కని నాటకములు. | 0—10—0 |
| 6 | పాండవాశ్వమేధము. | | 0—12—0 |
| 7 | [illegible]రామాయణము. | | 1—0—0 |
| 8 | [illegible] | | 0—6—0 |
| 9 | మృచ్ఛకటిక. | | 0—12—0 |
| 10 | బుద్ధచరిత్ర. (1908 సం [illegible]) | | 0—10—0 |
| 11 | శ్రీనివాసవిలాసము. (ఆత్మకూరు రంగారావు గారి కంకితము.) | | 1—0—0 |
| 12 | పల్లెటూళ్లపట్టుదలలు. (చక్కని ప్రహసనము.) | | 0—4—0 |
| 13 | అపూర్వకవితావివేచనము. (స్కూలుపిల్లల పాఠ్యగ్రంథము) | | 0—4—0 |
| 14 | అష్టకములు. (సంస్కృతము కడుసులభశైలి) | | 0—4—0 |
| 15 | విక్రమాంకదేవచరిత్ర. | ఈ 2 వచనములు చదివితీరవలెను. | 0—8—0 |
| 16 | చంద్రప్రభచరిత్ర. | | 0—8—0 |
| 17 | కామేశ్వరీశతకము. (సత్వరసయుక్తము) | | 0—2—0 |
| 18 | శనిగ్రహము. (ప్రసిద్ధికెక్కినది) | | 0—1—0 |
| 19 | వానమామలశతావధానము | | 0—3—0 |
| 20 | నానారాజసందర్శనము. (రాజులరికార్డు) | | 1—0—0 |
| 21 | శతావధానసారము. | | 0—12—0 |
| 22 | పాండవప్రవాసము. | | 0—12—0 |

## అచ్చుపడుచున్న పుస్తకములు.

1 సుకన్య- (నాటకము)

2 పండితరాయచరిత్రము. (నాటకము)

3 పాణిగృహీత. (శ్రవణానందమువంటిది)

4 దేవీభాగవతము, మొదలైనవి.

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని, శ్రీ భైరవప్రెస్సు, బందరు.